# జేజమ్మ కథలు

(పిల్లల కథలు - బొమ్మలతో)

సత్తిరాజు రాజ్యలక్ష్మి

ఈ పుస్తకం

........................................................

........................................................

............................................... గారిది.




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

JEJAMMA KATHALU (Pillala Kathalu with Illustrations) by Sattiraju Rajya Lakshmi

ప్రచురణ నెం : 2350/47
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : మార్చి, 2005



టైటిల్ డిజైన్ & లోపలి బొమ్మలు : చంద్ర

వెల : 40-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.
E-mail : visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్
(అబిడ్స్, సుల్తాన్ బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, అనంతపురం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.



Type Setting : A.R. GRAPHICS, Moosarambagh, Hyd-36. Ph.: 040 - 24554564.
ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, నారాయణగూడ, హైదరాబాద్ - 500 029.

# ముందుమాట

ఆధునిక విద్యావ్యవస్థలో బాల వాఙ్మయానికి ప్రముఖ స్థానం ఏర్పడింది. చాలా కాలం నుంచీ పిల్లలకు, అందునా పన్నెండు సంవత్సరాల వయసుకు లోబడిన పిల్లల మానసికావసరాలను దృష్టిలో పెట్టుకుని, వ్యాపకంగా బాల సాహిత్య రచనను సాగిస్తున్నాను.

1959వ సంవత్సరంలో, "బంగారు కథలు" అనే శీర్షిక కింద పన్నెండు చిన్న కథల పుస్తకాలు ప్రచురణ కివ్వడమైనది. ఆ పుస్తకాలకు నా భర్త కీ॥శే॥ సత్తిరాజు క్రిష్ణారావుగారు సంపాదకులు. ఆ బంగారు కథలను నలుగురు అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులం, పిల్లల మనస్తత్వాన్ని ఎరిగి, వారి ప్రేమాదరాలను చూరగొన్నవారమే రాశాం. ఈ పన్నెండు పుస్తకాలలో "పక్షి పాటలు" అన్న పుస్తకానికి శ్రీ సత్తిరాజు క్రిష్ణారావుగారికి కేంద్ర ప్రభుత్వ బహుమతి లభించింది. "చిలకమ్మ చుట్టాలు" అనే పుస్తకానికి కీ॥శే॥ ఆవంచ లక్ష్మారావుగారికి కూడా కేంద్ర ప్రభుత్వ బహుమతి లభించింది. "ఎలుగాయి కథ" అనే పుస్తకానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి నాకు ప్రథమ బహుమతి లభించింది. పన్నెండు పుస్తకాలలో నావి నాలుగు.

ఈ జట్టులోని నాల్గవ రచయిత కీ॥శే॥ శ్రీ యం.వి. రాఘవాచారి గారు.

'మేధావి' అనే ఉపాధ్యాయుల మాస పత్రికలో 'బాలభారతి' అనే శీర్షిక కింద 1960, 1961 సంవత్సరాలలో కొన్ని నా కథలు ప్రచురితమైనవి.

తరువాత 1971లో "ఏడు కథలు" అనే నా బాల వాఙ్మయాన్ని ప్రచురించాం.

ఒరిస్సా నుండి ప్రచురితమయ్యే ఒకే ఒక పిల్లల పత్రిక "ప్రియమైన చెల్లెలు". దానికి రెండు కథలను 1999లో పంపాను. దానికి శ్రీ విజయకుమార్ మహాపాత్రో సంపాదకుడు.

పైన వివరించిన కథలేకాక కొన్ని 1969, 1970 నాటి అముద్రితమైన కథలను కొన్నిటిని కూడా ఈ పుస్తకంలో పొందుపరిచాను.

ఉద్యోగ రీత్యా, ఇంకా ఆలిండియా రేడియో వారందించిన అవకాశంతో రెండు చిన్న నాటకాలను కూడా రాసి పిల్లలచేత వేయించాను. పిల్లలకు సంబంధించిన నా ప్రసంగాలనుకూడా ఆలిండియా రేడియో, హైదరాబాదువారు ప్రసారం చేశారు.

మగ పిల్లలకూ ఆడ పిల్లలకూ ఏడెనిమిది సంవత్సరాల వరకూ అభిరుచులలో అంత వ్యత్యాసం కనపడదు. తదుపరి కూడా - వైవిధ్యం మొదలైనా పది పన్నెండేళ్ల వయసు వరకూ సామరస్యం సాగుతూనే వుంటుంది. ఆ తరుణంలో వారు నిరంతరం సంఘంలో తమ స్థానాన్ని అన్వేషించుకుంటూ ఉంటారు. వారి కష్టసుఖాలు ఆ ప్రయత్నంతో ముడిపడి ఉంటాయి. అందుకే వారి మానసికావసరాలను పెద్దలం మనం, అంటే తలిదండ్రులం, ఉపాధ్యాయులం అర్థం చేసుకుని వారి పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడాలి.

నేను మూడు మాడెల్ ప్రయిమరీ పాఠశాలలకు ప్రిన్సిపాలుగా పనిచేసినప్పుడు, ఒక Case Study Book పెట్టుకునేదాన్ని. దాంట్లో అల్లరి పిల్లలు అనబడేవారి వివరాలను రాసి, వారి జీవిత సత్యాలనూ, ఒక విధంగా వారి వారి జీవిత చరిత్రనూ అర్థం చేసుకోగలిగాను. నేను రాసిన కథల్లోని పాత్రలు ఆ పిల్లలవే.

రెండు సంవత్సరాలనుండీ నా కథలను మరొకసారి వెలుగులోకి తేవాలని ఆలోచిస్తున్నాను. ఈ సందర్భంలో శ్రీ రెడ్డి రాఘవయ్యగారు ఒక కార్డు, నా భర్త శ్రీ సత్తిరాజు క్రిష్ణారావుగారి నుద్దేశించి రాశారు. ఆ లేఖలో వారి ఫోటో పంపమన్నారు. అప్పటికే శ్రీ సత్తిరాజు క్రిష్ణారావుగారు కీర్తిశేషులు. శ్రీ రాఘవయ్యగారి అభిమానాన్ని అర్థం చేసుకుని వారు తమ లేఖలో తెలిపిన ఫోను నంబరుకు ఫోనుచేశాను. వివరాలు తెలిపాను. అప్పుడాయన 'మీరు సత్తిరాజు రాజ్యలక్ష్మిగారా?' అనడిగారు. తమవద్ద "బంగారు కథలు" పన్నెండు పుస్తకాలూ ఉన్నట్టు చెప్పి మిగిలిన రచయితల ఫోటోలూ చిరునామాలూ కావాలన్నారు. నేను తప్ప మిగిలిన వారంతా కీర్తిశేషులని చెప్పాను. తరువాత నా చిరునామాను వెతుక్కుని మా ఇంటికొచ్చారు. మా ఫోటో లిచ్చాను. అప్పుడాయన నాకొక నివేదికనిచ్చారు. అది Ministry of Human Resources Development, Govt. of India. వారు Sponsor చేసిన శిక్షణా శిబిరం నివేదిక. "పిల్లల పుస్తకాల ప్రచురణ, పంపిణీ" అనే విషయం మీద. దానిని తిరగేసి చూస్తే, దాంట్లో "బాల సాహిత్య ప్రచురణ, అమ్మకాలు" అనే శ్రీ పి. రాజేశ్వర రావుగారి వ్యాసం ఉంది. దాన్ని చదివితే వారి ఆశయాలూ అభిరుచులూ మా ఆశయాభిరుచులకు తగినట్టున్నాయని అనిపించింది. అప్పుడు కథా రచయిత్రి శ్రీమతి చింతపెంట కమలగారికి నా మనసులో మాటను చెప్పి, నా కథలను విశాలాంధ్రవారు ప్రచురించే అవకాశముందా? అని ఫోనులో అడిగాను. దానికి సమాధానంగా ఆమె శ్రీ రాజేశ్వర రావుగారి ఫోన్ నెంబరు ఇచ్చి, నన్నే కనుక్కోమన్నారు. వెంటనే శ్రీ పి. రాజేశ్వర రావుగారికి ఫోను చేశాను. ఆయన నా కోరికను సాదరంగా మన్నించి, నా కథలను సంపాదకుల కమిటీ ముందుంచుతామనీ, వారు సమ్మతిస్తే ప్రచురణకు ఇస్తామనీ చెప్పారు. ఆ సమయంలో నాకు కలిగిన తృప్తి, అంతా ఇంతా కాదు. నా కథలను పంపాను, వాటి ప్రచురణకు ప్రచురణాలయం అంగీకరించింది. తొలుత నివేదికను నాకిచ్చిన శ్రీ రెడ్డి రాఘవయ్య గారికి నా కృతజ్ఞతలు.

విశాలాంధ్ర ప్రచురణాలయం నా పుస్తకాన్ని ప్రచురిస్తున్నందుకు నన్ను నేను అభినందించు కుంటున్నాను. నా బాల సాహిత్యాన్ని వెలుగులోకి తేవడానికి తోడ్పాటిచ్చిన శ్రీ పి. రాజేశ్వర రావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ పుస్తకంలో వేసిన చక్కని చిత్రాలు ప్రముఖ చిత్రకారుడు చిరంజీవి చంద్రగారివి. వారికి నా ఆశీస్సులు, ధన్యవాదాలు.

తొలిదశలో ఇచ్చిన సహకారానికి Fontline Graphics, శ్రీమతి నిర్మల గారికి నా ధన్యవాదాలు.

నా బాల సాహిత్యాన్ని ప్రచురించమని ప్రోత్సాహాన్నిచ్చిన, మా అబ్బూరి ఛాయాదేవికీ, మా తమ్ముడు అబ్బూరి గోపాలకృష్ణకూ నా ప్రేమపూర్వక ధన్యవాదాలు.

**– సత్తిరాజు రాజ్యలక్ష్మి**

## ఇందులో కథలు

# ప్రైమరీ, అప్పర్‌ప్రైమరీ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ఉపయోగపడే బాల సాహిత్యం

| సం. పుస్తకం పేరు - రచయిత | వెల రూ. |
|---|---|
| 1. సుప్రసిద్ధుల జీవిత విశేషాలు - డా॥ ... | 35 |
| ...గ్రహం - వాసిరెడ్డి భాస్కరరావు | 30 |
| 3. భగత్ సింగ్ - కె. ప్రతాపరెడ్డి | 50 |
| 4. మహోమనిషి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ - రావినూతల శ్రీరాములు | 20 |
| 5. పిల్లలకే నా హృదయం అంకితం - వి.వి. సుహోమ్లీన్ స్కీ | 100 |
| 6. ఫస్ట్‌క్లాసులో పాసవడం ఎలా? - జి. వెంకటేశ్వర్లు | 30 |
| 7. క్రికెట్ - ముకరమ్ | 15 |
| 8. చేతివేళ్ళే కంప్యూటర్లు - డా॥టి. సత్యనారాయణ రాజు | 30 |
| 9. నిత్యజీవితంలో భౌతికశాస్త్రం - యాకోవ్ పెరెల్మాన్ | 150 |
| 10. చొప్పదంటు ప్రశ్నలు - డా॥ మహీధర నళిని మోహన | 60 |
| 11. స్కూలు విద్యార్థులకు కంప్యూటర్ - సుధామూర్తి | 20 |
| 12. పాఠశాలలకు పర్యావరణ పరిజ్ఞానం - ఆళ్ల అప్పారావు | 30 |
| 13. మతిమరుపును మరిపించడం ఎలా? - అట్లూరి వెంకటేశ్వరరావు | 18 |
| 14. జనరల్ సైన్స్ - ముత్యాల ప్రసాద్ | 50 |
| 15. శ్రీమాకం వైజ్ఞానిక సర్వస్వ పెద్ద బాలశిక్ష - మాకం కృష్ణయ్యశెట్టి | 250 |
| 16. మిని జనరల్ నాలెడ్జ్ - పుష్పలత | 20 |
| 17. విశ్వవిజ్ఞాన దర్శిని - జె. నరేంద్రన్ | 140 |
| 18. ప్రసిద్ధ తెలుగు పద్యాలు (250 పద్యాలతో) - సంపా. పి.రాజేశ్వర రావు | 30 |
| 19. సుమతి - వేమన నీతి పద్యాలు - సంకలనం, సంపా. పి. రాజేశ్వర రావు | 20 |
| 20. అందాల అ ఆ లు (బాపుబొమ్మలతో) - మద్దులూరి రామకృష్ణ | 35 |
| 21. మహనీయుల హితోక్తులు - సంపా. పి. రాజేశ్వర రావు | 25 |
| 22. మహనీయుల మంచిమాటలు - సంపా. పి. రాజేశ్వర రావు | 25 |
| 23. చందు (కార్టూన్లు) - బాలి | 90 |
| 24. అందరికీ గణితం - టి. సత్యనారాయణ రాజ | 30 |
| 25. అందాల తెలుగు అ ఆలు - పి. రాజేశ్వర | 25 |
| 26. అబద్ధాలరాయుడు - సంకలనం: పి. రాజేశ్వర రావు | 35 |
| 27. అవ్వ - కోడిపుంజు - సంకలనం: పి. రాజేశ్వర రావు | 25 |
| 28. బాల మందారం - ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి | 36 |
| 29. బాలల బొమ్మల రామాయణం - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | 25 |
| 30. చిల్డ్రన్స్ నాలెడ్జ్ బ్యాంక్ - 5 - ఎమ్.వి. శాస్త్రి | 60 |
| 31. ఇందూ - చందూ - కె. సభా | 20 |
| 32. కల్పిత బేతాళ కథలు - 1 - డా॥ గంగిశెట్టి శివకుమార్ | 20 |
| 33. కల్పిత బేతాళ కథలు -2 - డా॥ గంగిశెట్టి శివకుమార్ | 20 |
| 34. లియో టాల్‌స్టాయ్ పిల్లల కథలు - సంకలనం: పి. రాజేశ్వరరావు | 35 |
| 35. నవ్వుల నవాబు నసీరుద్దీన్ కథలు - 1 సంకలనం పి. రాజేశ్వర రావు | 25 |
| ...నవ్వుల నవాబు నసీరుద్దీన్ కథలు - 2 సంకలనం పి. రాజేశ్వర రావు | 25 |
| 37. నసీరుద్దీన్ కథలు - సంకలనం: ప్రతిభ | 30 |
| 38. నేతాజీ సుభాష్ చంద్రబోస్ కథ - రెడ్డి రాఘవయ్య | 25 |
| 39. సంపూర్ణ బాలల బొమ్మల పంచతంత్రం కథలు - పడాల రామారావు | 20 |
| 40. ప్రసిద్ధ బాలల గేయాలు - పాటలు - సంకలనం: పి. రాజేశ్వర రావు | 20 |
| 41. శిబిచక్రవర్తి - సంకలనం పి. రాజేశ్వర రావు | 25 |
| 42. అన్నయ్య - చిన్నయ్య - కె. సభా | 30 |
| 43. అప్పు - నిప్పు - డి. కె. చదువుల బాబు | 30 |
| 44. పిల్లల బొమ్మల రామాయణం - పడాల రామారావు | 25 |
| 45. బాలల బొమ్మల భారతం - పడాల రామారావు | 25 |
| 46. బాలల బొమ్మల భారతం - పడాల రామారావు | 25 |
| 47. బుడుగు - ముళ్లపూడి వెంకటరమణ | 80 |
| 48. భగత్ సింగ్ - చాగంటి తులసి | 15 |
| 49. బోడిసలహా - డా. గంగిశెట్టి శివకుమార్ | 20 |
| 50. బంగారు రెక్కలు - డి. కె. చదువులబాబు | 25 |
| 51. చిల్డ్రన్ నాలెడ్జ్ బ్యాంక్ - 1 - ఎమ్.వి.శాస్త్రి | 70 |
| 52. చిల్డ్రన్ నాలెడ్జ్ బ్యాంక్ - 2 - ఎమ్.వి.శాస్త్రి | 70 |
| 53. చిల్డ్రన్ నాలెడ్జ్ బ్యాంక్ - 3 - ఎమ్.వి.శాస్త్రి | 80 |
| 54. చందమామ కథలు - మాచిరాజు కామేశ్వరరావు | 30 |
| 55. డ్రా అండ్ పెయింట్ - 1 - వై. ఇవనోవ్ | 25 |
| 56. డ్రా అండ్ పెయింట్ - 2 - వై. ఇవనోవ్ | 25 |
| 57. డ్రా అండ్ పెయింట్ - 3 - వై. ఇవనోవ్ | 25 |
| 58. జంతువుల మహాసభ - శారదా అశోకవర్ధన్ | 12 |
| 59. జాతీయపతాక గీతం - రావినూతల శ్రీరాములు | 12 |
| 60. జాబిల్లి - కె. సభా | 25 |
| 61. కీలుబొమ్మ - నార్ల చిరంజీవి | 45 |
| 62. నల్లకుక్క - డా॥ యం. హరికిషన్ | 20 |
| 63. పేనూ - పెసర చేను - నార్ల చిరంజీవి | 35 |
| 64. పిల్లల పాటల కథలు - కె. సభా | 20 |
| 65. తెలుగుపూలు - నార్ల చిరంజీవి | 10 |
| 66. తెల్లనక్క - నల్లకాకి - నార్ల చిరంజీవి | 15 |
| 67. ఎత్తుకు పై యెత్తు - కె. సభా | 25 |
| 68. యుక్తి - డా॥ గంగిశెట్టి శివకుమార్ | 20 |
| 69. విజ్ఞానశాస్త్ర వినోదాలు - ఎమ్. స్టాలియర్ యల్‌ఫోమిన్ | 30 |
| 70. విశాలాంధ్ర ఇంగ్లీషు - తెలుగు పాకెట్ డిక్షనరీ - ఆర్వియార్ | 50 |

**ప్రతులకు :**

## విశాలాంధ్ర బుక్ హౌస్‌లు, ప్రముఖ పుస్తక విక్రేతలు

# కమల విమల

కమలకు వయస్సు పదేళ్ళు. చిన్నతనంలో మసూచికం వచ్చి ముఖమంతా మచ్చలు పడ్డాయి.

ఒకనాటి మధ్యాహ్నం వాళ్ల బళ్లో చాలామంది పిల్లలు కలిసి ఆటలాడుతున్నారు. మధ్యలో విమల అనే ఒక నల్లటి అమ్మాయి, పదేళ్లది, కమలను ఢీకొని అనుకోకుండా కిందకు పడతోసి, తను కూడా పడిపోయింది. దానితో ఆటకు అడ్డు కలిగింది. పిల్లలంతా ఎవరికి తోచింది వాళ్ళు అన్నారు. కమల అడ్డంగా నిలబడిందనీ, విమల కావాలనే పడేసిందనీ ఏమేమో చెప్పుకున్నారు. దాంతో కమలకూ విమలకూ పట్టలేని కోపం వచ్చి, ఒకరినొకరు తిట్టుకున్నారు. "ఆ నల్లటి కాకిదే తప్పు" అంది కమల విమలను. "ఆ తిరగలి గంట్లదే నన్ను తోసింది!" అంది విమల.



ఇంతలో బడి గంట ఐంది. అంతా తరగతులలోకి వెళ్లారు. ఆ రోజల్లా కమలా విమలా ఏడుస్తూనే గడిపి, సాయంకాలం ఇండ్లకు వెళ్లారు.

కమల ముఖం చూసి వాళ్ల అమ్మానాన్నా. “ఏడిచావెందుకమ్మా” అని అడిగాయి. “ఘం ఒక అమ్మాయి నన్ను [illegible] గంట్లో, అని పిలిచంది” అని చెప్పి పెద్ద పెట్టున వెక్కి వెక్కి ఏడ్చింది. కమల తల్లీ తండ్రీ తమ పిల్లముఖం పైనున్న మచ్చలు ఆమెకు కష్టం కలిగించాయని విచారించారు.

కాస్త ఏడుపు తగ్గిందాకా బుజ్జగించి, నువ్వు కూడా ఆ అమ్మాయిని ఏమైనా అన్నావా కమలా? అని అడిగారు వాళ్ళ నాన్నగారు.

“ఆ” అని తల ఊపింది కమల.

“ఏమన్నావే” అని అడిగింది తల్లి.

నల్లగా ఉంటుందా అమ్మాయి, అందుకని ‘నల్లకాకీ’ అన్నాను అని నిజం చెప్పేసింది.

అప్పుడు వాళ్ళ అమ్మానాన్నా అన్నారు : “చూడు తల్లీ, అందం లేకపోతే మనం తోటివారిని వెక్కిరించవచ్చా? అందం పుట్టుకతో వచ్చేది, మన గొప్ప వలన రాదు.”

“నన్ను ముందు అట్లా ఎందుకన్నదీ, ఆ అమ్మాయి?” అడిగింది కమల.

“ఆ అమ్మాయి పొరపాటున అన్నదేమో, “అట్లా అనరాదు విమలా?” అని నువ్వు చెప్పితే బాగుండేది జన్మతో వచ్చిన అందం కోసం ఒకరినొకరు వెక్కిరించుకోవడం తప్పుకాదూ?” అని అడిగారు కమల నాన్నగారు.

కమల మాట్లాడకుండా విన్నది.

“విమల అమ్మానాన్నా ఎవరే?” అని కమల తల్లి అడిగింది.

“ఆ పిల్లకు తల్లీ తండ్రీ చచ్చిపోయారట” అన్నది కమల, వెంటనే తల్లి “అయ్యోపాపం! అటువంటి పిల్లను ఏమీ అనరాదు తల్లీ! మళ్లీ స్నేహం కలుపుకుని ఆ అమ్మాయిని రేపు మనింటికి తీసుకురా” అంది.

అప్పుడు కమల కళ్ల వెంట నీళ్లు కారినై. ఈసారి కోపంవల్ల కాదు. “విమలను నల్లకాకీ అని అనకుండా ఉంటే బాగుండేది” అనిపించింది కమలకు.

కమల తల్లీ తండ్రీ, ఇంకేమీ అనలేదు. కమల కూడా ఏమీ మాట్లాడలేదు. రాత్రి నిద్రకూడా రాలేదామెకు.

మర్నాడు మామూలు వేళకంటె, చాలా ముందుగా బడికి వెళ్లింది కమల. వెళ్లినవెంటనే విమల కూర్చునే చోటు వేపు చూసింది. ఇంకా విమల రాలేదు. అలాగే కొంతసేపు చూచింది బడివేళకు కాస్త ముందుగా విమల కూడా వచ్చింది. ఆమె ముఖం విచారంగా, పలుకరిస్తే ఏడ్చేటట్టుంది. వెంటనే కమల వెళ్లి – “విమలా, నన్ను క్షమించు, నిన్ను అనవసరంగా ‘నల్లకాకీ’ అని మనస్సు కష్టపెట్టాను. ఇంకెప్పుడూ అనను” అన్నది.

విమలకు ఏడ్పువచ్చింది. ఏడ్పులోనే ఇలా అన్నది. "నిన్ను నేను కూడా 'తిరగలి గంట్లూ' అన్నానుగా! మా అన్నయ్యా, వదినా "అంతే కావాలి నీకు. ఒకళ్ల జోలికి వెళ్లకూడదని తెలియదా!" అన్నారు.

ఆట గంట కొట్టగానే, కమలా, విమలా కలిసి బడి తోటలోకి పోయి కూర్చుని, చాలా స్నేహంగా మాట్లాడుకున్నారు. విరోధమంతా మర్చిపోయారు.

ఆ సాయంత్రం విమలను తన ఇంటికి తీసుకు వెళ్లింది కమల. వాళ్ల అమ్మా నాన్నా విమలను వాళ్లమ్మాయి లాగానే చూశారు. విమల కూడా వాళ్లను "అమ్మా, నాన్నా!" అనడం మొదలు పెట్టింది.

అది మొదలు కమలా విమలా బడిలో పిల్లలనెవర్నీ వెక్కిరించడం మానేశారు.

అందం లేని పిల్లలనెవరినీ, తిట్టడం వెక్కిరించడం మానేశారు. అందం లేని పిల్లలనూ అమ్మా నాన్నా లేని పిల్లలను, ఎక్కువ ప్రేమతో చూసి స్నేహం కలుపుకునే వాళ్లు.

# అలవాట్లు

మాధవుడు సుభద్రకు అన్న. వయసుకు పెద్దేకాని, చదువులోను పనిలోను సుభద్ర కన్న చిన్నవాడులా ఉండేవాడు.

రోజూ ప్రొద్దున ఎనిమిది గంటల వరకు నిద్రపోయే మాధవుడిని సుభద్ర లేపేది. "లేరా అన్నయ్యా, తొమ్మిదింటికల్లా భోజనం చేసి సిద్ధం కాకపోతే బడికి ఆలస్యమౌతుంది. ఇంకా నిద్రపోతూ ఉంటే ఎలారా?" అంటుంది.

"అబ్బ నువ్వు పోవే, నిద్ర ముంచుకొస్తూ ఉంటే ఏం చెయ్యమంటావు? అని కసిరిమాధవుడు ముసుగు నెత్తినిండా తన్ని, పడుకునేవాడు. ఇంకా కాసేపటికి, అమ్మ అతడిని బలవంతంగా లేపి కూర్చోపెట్టేది.

మాధవుడు సరిగ్గా పళ్లు తోముకోడు. వళ్లు రుద్దుకుని స్నానం చెయ్యడు. "అదేమిరా నాయనా" అని వాళ్ల అమ్మ అడిగితే వేళ లేదంటాడు.

బళ్లో పాఠాలు మాధవుడికి ఎన్నాళ్ళైనా కొత్తే. పాతవీ కొత్తవీ అంటూ వేరే లేవు. అన్ని పాఠాలూ అతనికి కొత్తవే.

బడికి వెళ్లేటప్పుడు అతను పట్టుకు పోవలసిన పుస్తకాలు సుభద్ర సర్దిపెడుతుంది. తనైతే చేతికి ఏవి దొరికితే అవే పట్టుకు వెళ్తాడు. రోజూ ఏదో ఒక పుస్తకం తక్కువ వస్తుంది.

బళ్లో పంతులు మాధవుడిని ఇంటికి పోయి పట్టుకు రమ్మంటాడు. అతడు ఇంటికి పోయి, దారిలో ఉన్న వస్తువులన్నిటినీ తన్నుకుంటూ, దొర్లించుకుంటూ నడుస్తాడు. తల్లి "ఏమిరా! మాధవా ఒకటే గొడవ చేస్తున్నావు?" అని అడుగుతుంది.




నా భూగోళం పుస్తకం కనిపించలేదమ్మా అంటాడు. పాపం ఆమె కూడా వెతుకుతుంది. చాలాసేపటిదాకా అది కనిపించదు. అప్పుడతని చిన్నచెల్లి, "అదెట్లా ఉంటుందిరా, అన్నయ్యా?" అని అడుగుతుంది. "కాస్త పాతగా ఉంటుందే" అని విసుక్కుంటాడు మాధవుడు. ఓహో! దాని నిండా చమురు మరకలుంటాయి కదూ? దానికి ఒక్కటే అట్టకదూ?" అని ఆమె అడుగుతుంది. "అవునమ్మా, రెండో అట్ట చినిగిపోయింది" అంటాడు. "అయితే పోయి వంట ఇంటి వెనకాల బొగ్గుల బుట్టలో ఉంటుంది తెచ్చుకో" అంటుంది చిన్న చెల్లి. పుస్తకాలంత చక్కగా దాస్తాడు మాధవుడు. బళ్లో కల్లా, ఏమీ రాని అబ్బాయి మాధవుడని పిల్లలందరికీ తెలుసు.

మాధవుడి తండ్రి మంచివాడు. మాధవుడిని ఎప్పుడూ కొట్టడు. ఎన్నిసార్లో చెప్పాడు. బుద్ధిగా బద్ధకం లేకుండా చదువుకోవాలని.

మాధవుడైనా చెడ్డవాడు మాత్రం కాడు. చాలా సున్నితమైన మనస్సు అతనిది. కాని అతనిలో కొంత బద్ధకం, హడావుడి ఉన్నాయి. చప్పున నిద్ర లేవడు, లేచినప్పుడు పక్కమీది దిండూ, దుప్పటీ తోచినవైపుకు విసిరి, పళ్లు తోముకోడానికి బయలు దేరుతాడు. "వాళ్ళమ్మతో ఎవరైనా అదేమిటండీ మాధవుడు అంత చెప్పిన మాట వినడు, బొత్తిగా చదువులో శ్రద్ధలేదు" అంటే "మా మాధవుడు పెంకివాడు మాత్రం కాదండి, వాడికింకా ప్రపంచ జ్ఞానం కలుగలేదు" అంటుంది. అట్లా పొరుగువారికి నచ్చచెప్పినా ఆమె మనస్సులో చాలా బాధపడుతుంది. తన మాధవుడు మంచివాడైనా చెడ్డపేరు తెచ్చుకుంటున్నాడే అని విచారిస్తుంది.

మాధవుడికి చుట్టుపక్కల వాళ్ళూ బళ్లో పిల్లలూ తనను గురించి చెడ్డగా అనుకుంటున్నారని చాలాసార్లు తెలిసింది, నిజమే. తల్లీ తండ్రీ ఎంత ముద్దుగా చెప్పినా తనుమాత్రం బద్ధకాన్ని పోగొట్టుకోలేకపోయాడు. చాలాసార్లు బద్ధకాన్ని పోగొట్టుకోవాలని అనుకున్నాడు. రాత్రి పడుకోబోయేటప్పుడు మర్నాడు తల్లి లేచేసరికి తనూ లేవాలని చాలాసార్లు అనుకున్నాడు. కాని ఉదయం చెల్లి సుభద్ర లేపినా లేవబుద్ధి వేసేదికాదు. పైగా చెల్లిని కోప్పడేవాడుకూడా.

ఇట్లా ఉండగా మాధవుడి తండ్రికి జబ్బు చేసింది. ఇంట్లో తల్లీ సుభద్రా తండ్రికి ఉపచారాలు రాత్రీ పగలూ శ్రద్ధగా చేస్తున్నారు. తను మాత్రం ఆలస్యంగా నిద్రలేచి, చేతికి దొరికిన పుస్తకాలు మాత్రమే తీసుకొని బడికి పోతున్నాడు.

బళ్లో చెల్లెలి తరగతి పిల్ల ఒకనాడు, "సుభద్ర బడికెందుకు రావడం లేదు" అని అడిగింది. "మా నాన్నకు జబ్బుగా ఉంది" అని మాధవుడు చెప్పాడు.

బళ్లో పిల్లలు తమ తండ్రుల జబ్బులను గూర్చీ, తల్లుల జబ్బులను గూర్చీ మాట్లాడుకుంటున్నారు. అందులో ఒక పిల్లవాడు తన తండ్రి జబ్బుచేసి చనిపోయాడని చెప్పి, కంట తడిపెట్టుకున్నాడు... మాధవుడు ఆ పిల్లవానివైపే చాలాసేపు చూశాడు. అతనికి తన తండ్రి జ్ఞాపకం వచ్చాడు. "నాన్న ఎంత మంచివాడు! ఆయనకూడా ఆ పిల్లవాని తండ్రిలా చనిపోతాడా? అమ్మో! ఇంకేమైనా ఉందా!" అనుకున్నాడు. మాధవుడికి ఉన్నట్టుండి భయం వేసింది. ఆ వేళ పంతులుతో చెప్పకుండానే తరగతి విడిచి ఇంటికి వెళ్లిపోయాడు.

ఇంట్లో సుభద్ర తండ్రి వద్ద కూర్చుని ఉంది. తల్లి వంట ఇంట్లో పనులు చూచుకుంటోంది. తండ్రి మాధవుడిని చూసి "ఏం నాయనా, పుస్తకమేదైనా మరిచిపోయావా?" అని అడిగాడు. మాధవుడు తిన్నగా వచ్చి తండ్రి కాళ్ల దగ్గిర కూర్చున్నాడు. "నాన్నా, నీకు ఎట్లా ఉంది?" అని అడిగాడు.

"బాగానే ఉంది బాబూ, కొంచెం గుండెల్లో నొప్పిగా ఉందంతే. నీకు వేళైంది పో బాబూ" అన్నాడు తండ్రి. "నాన్నా ఇవాళ మళ్లీ బడికి పోను" అని కళ్లల్లో నీరు పెట్టుకున్నాడు.

తండ్రి మాధవుడిని పరీక్షగా చూసి, బళ్లో ఎవరైనా అతన్ని గేలిచేసి ఉండాలి అనుకుని "పోనీలే ఇవాల్టికి బడికి పోకు" అని "మాధవా, నువ్వు బద్ధకం పోకొట్టుకోవాలి నాయనా చెడ్డ అలవాట్లు ఎప్పటికైనా పోగొట్టుకోవాలి. సుభద్రచూడు, నీకన్న చిన్నది అయినా దానికి మంచి అలవాట్లున్నాయి. నువ్వు చాలా మంచి పిల్లవాడివి. ఐనా ఎవ్వరూ నువ్వు మంచివాడవని అనరు. చెడ్డ అలవాట్లు పోగొట్టుకోవడం మొట్టమొదట కష్టం అనిపించినా, పట్టుదలగా ప్రయత్నం చేస్తే తప్పక అవిపోయి మంచి అలవాట్లు ఏర్పడుతాయి" అన్నాడు. అప్పుడు సుభద్ర అంది. "చూడరా అన్నయ్యా, నాన్న జబ్బులో కూడా, నీ గురించే ఎంతగా ఆలోచిస్తున్నారో!" అని.

మాధవుడు ఏమీ మాట్లాడలేదు. ఆవేళల్లా తండ్రి దగ్గరే ఉన్నాడు. "పోయి పడుకో" అని రాత్రి తల్లీ తండ్రీ చెప్పిందాకా పోయి పడుకోలేదు. మర్నాడు ఉదయం తల్లికన్నా ముందుగా నిద్రలేచి పళ్లు తోముకుని, స్నానంచేసి, తండ్రికి పళ్లు తోముకుందుకు నీళ్లు తాటాకు పళ్లపోడి తీసుకువచ్చి ఒక కుర్చీ పీట మీద పెట్టాడు.

తండ్రి కళ్లు తెరిచేసరికి మాధవుడు ఎదురుగా కూర్చుని ఉన్నాడు. "రాత్రి నిద్రపట్టలేదా మాధవా?" అన్నాడు తండ్రి. "పట్టింది నాన్నా" అన్నాడు మాధవుడు.

ఆ రోజు కూడా మాధవుడు బడికి పోలేదు. సుభద్రను "పోయి అమ్మకు సాయం చెయ్యి" అని తను తండ్రి దగ్గరే కూర్చున్నాడు. ఆ వేళ ఇంట్లో వస్తువులను తన్నుకుంటూ దొర్లించుకుంటూ నడవలేదు. అతని మనస్సు ప్రశాంతంగా ఉంది. తనపనులన్నీ ఎవ్వరూ జ్ఞాపకం చెయ్యకుండానే చేసుకుపోయాడు. అతని తల్లి అతనిలో వచ్చిన మార్పుచూసి సంతోషించింది. భర్తతో మన మాధవుడు ఎప్పటికైనా మారుతాడని నేను అనుకుంటూనే ఉన్నాను అని అంది.

మర్నాటి నుండి తండ్రికి ఆరోగ్యం బాగవుతూ వచ్చింది. మాధవుడు బడికి వెళ్లాడు. బళ్లో అతిశ్రద్ధగా చదువుతున్నాడు. పంతుళ్ళంతా మాధవుడి తెలివితేటలు మెచ్చుకుంటున్నారు. బళ్లో పిల్లలంతా, "ఏమిరా మాధవా ఉన్నట్టుండి నువ్వు ఇంత మారిపోయావు!" అంటే "ఇది వరకు నాకు కొన్ని చెడ్డ అలవాట్లు ఉండేవి. ఇప్పుడు వాటిని పోగొట్టుకున్నాను అంతే" అనేవాడు.

ఇప్పుడు మాధవుడికి మంచి అలవాట్లవల్ల వచ్చే లాభం బాగా తెలిసింది. బళ్లో ఎవరైనా చెడ్డ అలవాట్లు గల పిల్లవాడుంటే దగ్గర కూర్చోబెట్టుకుని "పట్టుదలగ వాటిని పోగొట్టుకోవాలి" అని చెప్తాడు.

"అట్లా పోగొట్టుకుంటే బళ్లోను ఇంట్లోను అంతా ఎక్కువగా గౌరవించి ప్రేమిస్తారు" అని కూడా చెపాడు.

ఇప్పుడు మాధవుడి తల్లినిగాని, తండ్రినిగాని "మీ పిల్లవాడు చెప్పిన మాట వినడేం?" అని అడిగేవాళ్లు లేరు. మాధవుడికి తల్లీతండ్రీ "అదిచెయ్యి ఇదిచెయ్యి" అని చెప్పవలసిన అవసరం లేదు. సుభద్ర నిద్రలేపవలసిన అవసరం కూడా లేదు. బళ్లో పాఠాలన్నీ పాతవైనై.

# గమ్మత్తు కథ

రాత్రి భోజనాలయాయి. తాతయ్యతోపాటు వెన్నెలలో కూర్చున్నారు పిల్లలంతా.

"చెప్పుతాతా!" అన్నాడు బాబు.

"ఏమి చెప్పాలిరా?" అన్నాడు తాతయ్య బాబు బుగ్గలు నులిమి.

"గమ్మత్తు కథ" అన్నాడు బాబు.

"సరే వినండి" అని మొదలు పెట్టాడు.



అనగా అనగా ఒక ఊరుండేది. ఆ ఊళ్లో తళతళ అనే పిల్ల ఉండేది. ఆ పిల్లను వాళ్ల అమ్మానాన్నా చాలా ముద్దుగా పెంచుతున్నారు. ఒకనాడు ఆ పిల్ల ఆడుతూ, ఆడుతూ ఊరి బయటకు వెళ్లింది. అక్కడ పెద్ద కొండరాయి ఉంటే దానిమీద కూర్చుంది. ఆ రాతిపైన చిన్న బిరడాలాగా ఏదో కనుపించింది. తళతళకు తీసి చూడాలనిపించింది. ఆ బిరడాను అటూ ఇటూ తిప్పింది. వెంటనే రకరకాల సంగీతం వినిపించింది. తళతళ ఆశ్చర్యపోయి మళ్లీ తిప్పింది. ఈసారి ఆ బిరడా కాస్తా లోపలికి దిగిపోయి ఒక రూపాయి కాసంత కన్నం కనిపించింది.

ఆ కన్నంలోకి తొంగి చూచింది. దాంట్లో తనంత పిల్లలిద్దరు మంచి మంచి అందమైన బట్టలు తొడుక్కుని చక్కని రకరకాల బొమ్మలతో సంతోషంగా ఆడుకుంటున్నారు. "ఆ పిల్లలు అంత చిన్న కన్నంలోంచి లోపలకు ఎట్లా దిగారా?" అని ఆలోచించింది తళతళ.

కాసేపటికి వాళ్లనే అడగాలనిపించి కేకవేసింది ఏయ్ అమ్మాయిలూ అని. వాళ్లాకేక వింటేగా! దగ్గరపడి ఉన్న కొన్ని గులకరాళ్లను తీసుకుని ఒక్కొక్కటే ఆ కన్నంలో నుండి వేసింది. మూడు రాళ్లు పడ్డ తరువాత లోపల ఉన్న పిల్లలు ఇద్దరూ పైకి చూశారు.

వాళ్లు పైకి చూడగానే "లోపలికి నేనుకూడా రావచ్చా?" అని వాళ్లను అడిగింది తళతళ.

"ఓ! రావచ్చు కాని మాలాగా బుద్ధిమంతురాలివైతేనే రానిస్తాం" అన్నారు వాళ్లు.

"నేను కూడా బుద్ధిగా ఉంటా. ఆ బొమ్మలతో ఆడుకోనిస్తారా?" అన్నది తళతళ. అట్లాగే రా అంటూ వాళ్లు నేలపైన ఒక బిరడాను నొక్కారు. వెంటనే తళతళ కూర్చున్నచోట పెద్ద తలుపు తెరుచుకుని లోపలకు దిగేటందుకు మెట్లు కనిపించాయి. ఆ మెట్ల మీదనుండి దిగి ఆ పిల్లల దగ్గరకు వెళ్లింది తళతళ.

వాళ్లను "మీ పేర్లేమిటి?" అని అడిగింది. అందులో ఒక పిల్ల "నా పేరు కలకల దాని పేరు కళకళ" అన్నది.

వాళ్లు ముగ్గురు కాసేపు మాట్లాడుకున్నారు. తరువాత కళకళ అన్నది. "మా దగ్గరకు వచ్చావు కదా, నువ్వు మా బొమ్మలన్నీ చూస్తావా?"

"చూపిస్తారా? నాకు బొమ్మలంటే ఎంతో ఇష్టం" అన్నది తళతళ.

వాళ్ళు తళతళకు రకరకాల బొమ్మలు చూపించారు. గుడ్డ బొమ్మలూ, అట్ట బొమ్మలూ, గుడ్డ పువ్వులూ, ఊలు బొమ్మలూ, మట్టి బొమ్మలూ, రకరకాలవీ, రంగురంగులవీ చూపించారు. తళతళ "మీకివన్నీ ఎక్కడనుంచి వచ్చాయి?" అని అడిగింది.

వాళ్ళు "మేమే చేసుకుంటాం, మాకు కావలసిన ఆట సామానులన్నీ" అన్నారు. తళతళ వాళ్లను "ఇంత చక్కని బొమ్మలు చేసుకోవడం ఎలాగా?" అని అడిగింది. కలకల, కళకళ "పాపం ఈ అమ్మాయికి ఈ బొమ్మసామాన్లు చేసుకోవడం నేర్పాలి" అనుకున్నారు.

తళతళ రోజూ "ఆడుకుని వస్తానని" వాళ్ళమ్మతో చెప్పి, కొంత అడుగున ఇంట్లో ఉన్న అమ్మాయిల దగ్గరకు వెళ్లేది. వాళ్ల ముగ్గురికీ స్నేహం బాగా కలిసింది.

మొదట కాగితాలు, మెంతులూ నానపెట్టి, రుబ్బి, ఆ గుజ్జుతో పళ్ళూ కాయలూ, బుట్టలూ బొమ్మలూ చెయ్యడం చూపించారు. తరువాత, మట్టితో బొమ్మసామాను చేసి రంగు వేయడం నేర్పారు. ఆఖరున రంగుకాగితాలతోటి పువ్వులూ బుట్టలూ చేయడం, గుడ్డ బొమ్మలూ, బొమ్మగుడ్డలూ అందంగా కుట్టడం నేర్పారు. కలకల, కళకళ బాగా చేసేవారు. తళతళ కూడా చాలా బాగా చెయ్యడం నేర్చుకుంది.

ఒకసారి తళతళ తండ్రికి జబ్బు చేసింది. ఉద్యోగంలోకి పోలేక ఇంట్లోనే ఉండిపోయాడు. అందుకని ఆయనకు ఆరు నెలలు జీతం రాలేదు. తళతళ తల్లి చేతిలో డబ్బులేక ఇబ్బంది పడింది.

అప్పుడు తళతళ తను కలకల, కళకళ వద్ద కష్టపడి నేర్చుకున్న పనితోటి రకరకాల బొమ్మలు చేసి అమ్మి డబ్బుతెచ్చి తల్లికిచ్చింది. తళతళ తల్లీ తండ్రీ చాలా సంతోషపడ్డారు.

గారాబంగా పెంచినా బుద్ధిమంతురాలే ఐంది. తండ్రికి జబ్బు తగ్గేదాకా తళతళ అలా డబ్బు సంపాదించింది.

తండ్రికి జబ్బు తగ్గి మళ్ళీ ఉద్యోగంలో చేరేదాకా తళతళ తన స్నేహితుల దగ్గరకు పోలేదు. "ఏమో మన స్నేహితురాలు రావడంలేదు" అని వాళ్లు రోజూ అనుకునేవారు. ఇట్లా ఉండగా ఒకరోజు ఎంతో సంతోషంతో వచ్చి, వాళ్లు తనకు నేర్పిన పని తనకు ఎంత ఉపయోగించిందో చెప్పింది. వాళ్లు కూడా సంతోషించి, "నువ్వు బుద్ధిమంతురాలివి కాబట్టే, మేము నీకు నేర్పాం" అని అన్నారు.

"తరువాత వాళ్లంతా నిద్రపోయారు, మనని కూడా నిద్రపొమ్మన్నారు" అన్నాడు తాతయ్య.

# నేర్పకుండా వచ్చిన పాఠం

గుండు అనే పిల్లవాడుండేవాడు, వాడి వయస్సు ఎనిమిది సంవత్సరాలు. వాళ్ల అమ్మానాన్నా అతిగారాబంచేసి గుండును చెప్పిన మాట వినకుండా చేశారు. వాడు ఏపనైనా చెయ్యాలనుకుంటే అమ్మా నాన్నా ఒద్దన్నా చేస్తాడు.

కొన్నాళ్లకు వాళ్లమ్మానాన్నా విసుగెత్తి "ఒరేయ్ గుండూ నువ్వు కనుక మేము చెప్పినమాట వినకపోతే నీకే నష్టంరా" అని చెప్పారు.



ఒకసారి గుండు "నేను హిమాలయపర్వతాలు ఎక్కాలమ్మా" అన్నాడు.

మరోసారి నేను "ఏడుసముద్రాలూ ఈదుతా నాన్నా" అన్నాడు.

ఇంకోసారి నేను "పక్షులకు మల్లే ఆకాశంలో ఎగురుతా" అన్నాడు.

తల్లీ తండ్రీ అవి చెయ్యలేని పనులని చెప్పితే కోపం తెచ్చుకున్నాడు.

ఒకనాడు గుండు ఊరి వెలుపల ఉన్న తోటలోకి వెళ్లాడు ఒక్కడూ. అక్కడ ఒక సపోటా చెట్టుకింద పడుకుని ఆలోచిస్తున్నాడు.

అలాగే ఆలోచిస్తూ ఉండగా వాడి ముందు ఒక విమానమంత పక్షి వాలింది. దానిమీదకెక్కి కూర్చున్నాడు గుండు. ఆ పక్షి అడిగింది "నీ పేరేమిటి?" అని "నా పేరు గుండు" అన్నాడు వాడు.

అప్పుడా పక్షి "నువ్వు గుండువి, నీ తెలివి సున్న గుండుసున్న అనే పేరు నీకు ఇంకా బాగుంటుంది" అనేసి పకపకా నవ్వింది.

గుండుకు పక్షిమీద చాలా కోపం వచ్చినా, దానిమీద ఎక్కి ప్రయాణం చెయ్యాలనే సరదా వలన నోరు మూసుకుని కూర్చున్నాడు.

ఆ పక్షి ఆకాశంలో చాలా దూరం ఎగిరింది. దానిమీద కూర్చుని గుండు కూడా ప్రయాణం సాగించాడు. ఆకాశంలో చాలా తెల్లని మేడలు కనిపించాయి. వాటి మధ్య నీలం రంగు మేడలూ, బూడిద రంగు మేడలూ, ఎర్ర రంగు మేడలూ, ఇంకా ఎన్నోరంగుల మేడలూ కనిపించాయి. ఆ పెద్ద పక్షిని గుండు కాస్త ఆగమని అడిగాడు. "అట్లా ఆగరాదు గుండుసున్నా" అంది పక్షి.

అట్లా చాలాసేపు సరదాగా తిరిగాడు గుండుసున్న. తరువాత ఆ పక్షి తెల్లని ఎత్తైన కొండలమీద అతనిని దింపి అతను పిలుస్తున్నా పలకకుండా ఎగిరిపోయింది.

తెల్లని కొండలు తెల్లనివికావు. నల్లని కొండలమీద మంచు కురిసి తెల్లగా కనుపించాయి. అక్కడే కూర్చున్నాడు గుండు. తన పేరు గుండు అన్నది మరచిపోయి, పక్షి పెట్టిన పేరే జ్ఞాపకం ఉంచుకున్నాడు. మాట్లాడలంటే ఎవ్వరూ కనుపించలేదు. ఆకలిగా ఉంది. తినడానికి తన దగ్గర ఏమీ లేదు. అయ్యో అమ్మనడిగి వచ్చేటప్పుడు కాసిని రొట్టెలు తెచ్చుకోవలసింది అనుకున్నాడు.

చాలాసేపు అట్లాగే కూర్చుని కూర్చుని విసుగెత్తి ఆ కొండల్లో ఏముందో చూద్దామని లేచాడు. కాస్త దూరంలో ఇంకా కాస్త ఎత్తైన కొండ కనిపిస్తే దాన్ని ఎక్కాలని వెళ్లాడు. కాస్త పైకి ఎక్కేసరికల్లా అమ్మబాబో ఒక పెద్ద రాక్షసుడు కనుపించాడు. గుండుసున్నకు చాలా భయం వేసింది. కాళ్లూ చేతులూ వణికాయి. ఆ రాక్షసుడికి పెద్ద తలకాయ ఉంది. కాళ్ళూ చేతులూ పొట్టిగా ఉన్నాయి. కాని భలేలావుగా ఉన్నాడు. వాడి నోరు చాలా వెడల్పుగా ఉంది. నోట్లో పళ్లు అరటిపళ్ల పెళ్లల లాగా ఉన్నాయి. కళ్లు పెద్ద గుండు చెంబుల్లాగా ఉన్నాయి. వాడి శరీరపు రంగు మసిబొగ్గులాగా ఉంది. వాడు గుండుసున్నవైపు చూచినప్పుడు వాడికళ్లు బావిగిలకల లాగా గిర్రునతిరగాయి. గుండుసున్నాకు ఏడవాలన్నా గొంతు పెగలలేదు. ఒక్క అడుగు ముందుకు కూడా వెయ్యలేదు. అంత మంచుకురిసే కొండల్లో కూడా వాడికి చెమటపోసి కాలవలలాగా కిందకు పారింది. ఆ రాక్షసుడు గుండుసున్నా దగ్గరకు వచ్చి "చిన్న పిల్లలు ఇంతదూరం పెద్దవాళ్లకు చెప్పకుండా రావచ్చా?" అని అతనిని ఒక్క తోపు తోశాడు.

ఆ తోపుతో గుండుసున్నా పెద్ద సముద్రంలో పడ్డాడు. పడ్డాడుగాని నీళ్లలో మునగలేదు. ఆ నీరు రంగు రంగులుగా కనిపించింది. చేత్తో తీస్తే చేతులోకి రాలేదు. ఆ సముద్రంమీద తేలుతూ తేలుతూ ఎంతదూరం వెళ్లాడో! ఈ లోగా అతనికి ఆకలి చాలా ఎక్కువగా వేసింది.

ఆ పక్షి వదిలేసిందిగానీ, మళ్లీ ఇంటికి తీసుకెళ్లేదెవరు? తనను మళ్లీ అమ్మానాన్న వద్దకు తీసుకువెళ్లకపోతే ఎట్లా? అట్లా ఆలోచించేసరికి మరీ భయంవేసి ఒకటే ఏడుపు మొదలు పెట్టాడు గుండుసున్నా. వాడి ఏడుపు సముద్రపు హోరులో కలిసిపోయింది.

ఇంకా కాసేపటికి ఇంద్రధనుస్సులో ఉండే అన్ని రంగులూ కంటికి మెరుపులాగా కనిపించాయి. గుండుసున్నా ఏడుపుమాని కళ్లు నలుపుకుని చూశాడు.

ఆ సముద్రం పై అందమైన ధగధగ మెరిసే చెప్పులు వేసుకుని ఒక స్త్రీ కనిపించింది. ఆమెకు పాదాలవరకు జడ ఉంది. ఆమె తలలో అన్నిరకాల రంగురంగుల పూలూ ఉన్నై. నవ్వితే మెరుపు మెరిసినట్లు వెలుగు వస్తుంది. ఆమె చేతులు దూదిలాగా మెత్తగా ఉన్నై. ఆమె అందం వర్ణించడానికి వీలులేదు. ఆమె తన మెత్తని చేతితో గుండుసున్నా తల నిమిరి "బాబూ బెంగ పెట్టుకోకు. పెద్దవాడివైనదాకా పెద్దలమాట విను." అని అంటూ ఉండగా గుండుసున్నాకు సముద్రమూ కనుపించలేదు ఇంకేమీ కనుపించలేదు. కళ్లు నలుపుకుని చూచేసరికి వాళ్ల అమ్మ తన మంచం మీద కూర్చొని ఉంది.

"ఏం బాబూ, గట్టిగా ఏడ్చావు? కల ఏమైనా వచ్చిందా?" అని అడిగింది వాళ్లమ్మ.

గుండుకు వాళ్లమ్మను చూసేసరికి ప్రాణంలేచి వచ్చినట్లైంది. తను ఇంట్లోనే ఉన్నట్లూ, అప్పుడే తెల్లవారుతున్నట్లూ తెలుసుకున్నాడు. తనని 'గుండుసున్నా' అని ఎవ్వరూ పిలవరని ధైర్యం వచ్చింది.

ఆ రోజు నుండీ 'అక్కడికి పోతాను, ఇక్కడికి పోతాను' అని అల్లరి పెట్టడం మానేశాడు. అంతే కాకుండా కల ద్వారా తన కోరికలన్నీ తీరినై. కోరికలు తీర్చటమేకాక ఆ కల గుండుకు పెద్ద పాఠం నేర్పింది.

# ఎలుగాయి కథ

ఒక అడవిలో అన్నిరకాల జంతువులూ ఉండేవి. వాటిలో ఒకచిన్న ఎలుగుగొడ్డు ఉండేది. దానిని 'ఎలుగాయి' అని పిలిచేవి ఆ అడవిలో జంతువులు. ఎలుగాయి ఈడుకు చిన్నవాడే కాని వాడి మనస్సు ఎప్పుడూ ఊరికే ఉండదు. ఒకనాడు వాడి తల్లితోటీ తండ్రితోటి చెప్పాడు. "నాకు ఈ అడవిలో ఈ జంతువుల మధ్య జీవించడం చాలా విసుగుగా ఉంది. ఎప్పుడూ ఏ మార్పులేకుండా ఒకటే తీరున బతకాలి."

వాడి తల్లీ తండ్రీ పొట్టచెక్కలయేటట్లు నవ్వి "ఒరేయ్ ఎలుగబ్బాయ్ నువ్వు జంతువువేకదా జంతువుల మధ్య జీవించకుండా ఇంకెక్కడ జీవిస్తావురా?" అన్నాయి.

"అవును, నేను జంతువునే ఐతే మాత్రం ఎప్పుడూ జంతువుల మధ్యనే పడి ఉండాలని ఉందా? నాకు మనుష్యుల తోటి కలిసి జీవించాలని ఉంది. ఇంక మీరిద్దరూ నాకేమి చెప్పినా వినదలచుకోలేదు" అని అరిచాడు ఎలుగాయి.



"ఒరేయ్ నీకు వయస్సు చాలా తక్కువ. పెద్దవాడివయ్యేదాకా మా మాట విను. తరువాత నీ ఇష్టం" అన్నాడు తండ్రి ఎలుగు.

"అయితే మీరు చెప్పేదేమిటి?" అని కోపంగా కసురుకుంటూ అడిగాడు ఎలుగాయి.

అప్పుడు తల్లి ఎలుగు అన్నది. "అబ్బాయీ కోపం తెచ్చుకోకు - మనుష్యులతోటి జీవించాలని నీకు ఉన్నా, వాళ్లు నీతో జీవించడానికి ఇష్టపడరు. నువ్వు మరీ మొండికెత్తితే నిన్ను చంపేస్తారు కూడా."

తండ్రి, "నీకు అటువంటి కోరిక ఎందుకు పుట్టిందిరా?" అని అడిగాడు. నాకు మనుష్యులతోటే జీవించాలని ఎప్పుడూ అనిపిస్తుంది. ఎందుకంటే వాళ్లు చక్కగా మంచి బట్టలు వేసుకొని తిరుగుతారు. మంచాల మీద పరుపుల మీదా పడుకుంటారు. మంచి మంచి పళ్లాలలో భోజనం చేస్తారు. హాయిగా రకరకాల కుర్చీలలో కూర్చుంటారు. మంచి మంచి ఇండ్లలో నివసిస్తారు. మనమో! మనదీ ఒక బతుకేనా? ఎప్పుడూ ఏదో దొరికిందింత తిని ఏగుట్టలలోనో పడి ఉండాలి. ఛీ! నేనింక ఇట్లా బతక దలచుకోలేదు" అన్నాడు ఎలుగాయి.

వాడి తండ్రికీ తల్లికీ వాడికి ఎట్లా నచ్చచెప్పాలో తోచలేదు. ఏది చెప్పినా వినకుండా మొండిగా వాదిస్తున్నాడు.

కొంత సేపటికి తల్లి అన్నది బతిమాలుతూ "మనుష్యులతో జీవించాలనే కోరిక బాగానే ఉంది. కాని అది చాలా ప్రమాదమైన జీవితం. అటువంటి ఆలోచనలను వదులుకో నాయనా! అయినా నువ్వు మనుష్యుల దగ్గరకు పోవడం వాళ్లతో కలిసి ఉండటం ఎట్లా కుదురుతుందిరా?" అని.

"నువ్వూ, నాన్నా నన్ను తీసుకువెళ్లి వాళ్ల దగ్గర దింపి రండి. నేనక్కడే ఉండిపోతా. వారం రోజుల క్రితం ఎవరో సర్కసు మనుష్యులు నన్ను తీసుకుపోదామనివస్తే నాన్న నన్ను దాచేశాడు. లేకపోతే నేనీ పాటికి హాయిగా మనుషుల మధ్య ఉండేవాడిని" అని అన్నాడు ఎలుగాయి. తండ్రికి చాలా విసుగు పుట్టింది. అయినా "నీకు నీ మంచి తెలియటం లేదురా. సర్కసు వాళ్లతోపోతే నీ కోరికలన్నీ తీరవు సరికదా వాళ్లు నిన్ను చాలా బాధపెడతారు. నేను చెప్పిన మాటవిని ఆ గొడవ మరచిపో నాయనా" అని చెప్పి చూశాడు.

ఎలుగాయికి మళ్లీ కోపం వచ్చింది. తల్లీ తండ్రీ తనను సుఖపడనీయరని అనుకుని స్నేహితుల సలహాకోసం బయలుదేరాడు.

అడవిలోని అన్ని జంతువుల పిల్లలతోటీ ఎలుగాయి ఎనాడో స్నేహం చేశాడు. వాడు మొదట ఒక సింహం పిల్లవాడి దగ్గరకు వెళ్లాడు. "ఒరేయ్ సింహా, నాకు మనుష్యులలాగ జీవితం గడపాలని ఉంది. మా అమ్మానాన్న మనుష్యుల దగ్గరకు పోనివ్వరు, ఏం చేసేదిరా?" అని అడిగాడు.

"ఒరేయ్, ఎలుగాయ్ మా అమ్మానాన్నా కూడ పోవద్దనే అంటారు రా - మనం వాళ్ళను అసలు అడగనే కూడదురా" అన్నాడు సింహపు పిల్లవాడు.

ఎలుగాయికి ఈ సలహా బలేనచ్చింది. అయినా అంతటితో ఊరుకోలేదు. మా అమ్మానాన్నా నన్ను పోనివ్వటం లేదు అని చెప్పాడు. మా అమ్మానాన్నా కూడా వెళ్ళవద్దని అన్నారు. అందుకని నేను వెళ్లడం మానేశానురా" అన్నాడు ఏనుగాయి.

"నీ ముఖం అమ్మానాన్నా ఎప్పుడూ ఒద్దనే అంటారు వాళ్లు ముసలి వాళ్లు, శుద్ధ పిరికి నాయనమ్మలు. వీళ్ళు వద్దన్నారని మానేస్తావా దద్దమ్మా?" అని అడిగాడు ఎలుగాయి.

"అవునురా మనం ఇంకా చిన్నవాళ్ళం కాబట్టి పెద్దవాళ్ల మాట వినాలి" అని ఇక మాట్లాడకుండా ఏనుగాయి అక్కడి నుండి వెళ్లిపోయాడు.

ఎలుగాయి ముఖం చిట్లించుకుని మరొక చోటికి వెళ్లాడు. ఈ సారి ఒక కోతి పిల్లవాడిని కలిశాడు తన కోరికను తెలియపరచి వాడి సలహా ఏమిటని అడిగాడు.

"ఒరేయి ఎలుగాయి, అమ్మానాన్నా ఏది వద్దంటే అదే చెయ్యాలిరా అప్పుడే మంచి గమ్మత్తుగా ఉంటుంది." అని కోతి సలహా ఇచ్చాడు. ఈ సలహా ఎలుగాయికి చాలా బాగా నచ్చింది. అయినా ఇంకా మిగిలిన జంతువుల పిల్లల సలహాలు కూడా తీసుకునేటందుకు అందరినీ మర్నాడు ఒక సభ జరుపుకుందాం రమ్మని పిలిచాడు.

మర్నాడు సభ మొదలైంది. సభకు వచ్చిన రకరకాల జంతువుల పిల్లలూ చక్కగా షోకులు చేసుకుని వచ్చాయి. అందులో కొన్ని చెరుకుముక్కలూ, దుంపముక్కలూ, పచ్చివేరుసెనగకాయలూ, ఇంకా ఏవేవో కొరుక్కుని తింటూవచ్చాయి. సభకు వచ్చిన జంతువులలో ఒక్కటీ పెద్దది లేదు. వచ్చినవన్నీ తమకు తోచినట్లు మనుష్యులను గూర్చి చెప్పాయి. మొత్తానికి అన్నీ మనుష్యులలాగ జీవించాలనే కోరుకున్నాయి. ఒకటి రెండు జంతువులు ఒప్పుకోకపోయినా మిగిలినవన్నీ పెద్దవారి సలహా ఎప్పుడూ వినరాదు. అనే నిశ్చయానికి వచ్చాయి. సరేనంటే సరే ననుకున్నాయి. అందులో నక్కపిల్లవాడు లేచి మొట్టమొదట మనలో ఒకళ్లు మనుష్యుల దగ్గరకు పోయి జీవించాలి. కొన్నాళ్ళ తరువాత మిగతా వాళ్లం అందరం పోవచ్చును అన్నాడు. సభలోని వారంతా దీనికి ఒప్పుకున్నారు. ఈసారి ఎవరైనా సర్కసువాళ్ళు అడవిలోకి జంతువుల కోసం వస్తే ఎలుగాయిని పట్టుకుపోయేటట్లు చూడాలన్నారు. తమ తల్లిదండ్రులకెవ్వరికీ ఈ విషయం తెలియనీయ రాదన్నారు. అంతా ఒప్పుకున్న తరువాత సభ ముగిసింది.

వారం రోజులు తిరగకుండానే ఒక సర్కసు కంపెనీ వాళ్లు ఆ అడవిలోకి వచ్చారు. ఎలుగాయిని స్నేహితులంతా చేరి రహస్యంగా వాళ్ళు తీసుకుపోయేటట్లు చేశారు.

ఎలుగాయి తల్లీతండ్రీ రెండు మూడు రోజులదాకా వాడికోసం వెతికి వెతికి రాత్రి నిద్రా పగలు తిండీ మాని చివరకు ఏ సర్కసువాళ్ళో తీసుకుపోయి ఉంటారని ఇక చేసేది ఏమీ లేక ఊరుకున్నాయి.

ఈ లోగా అడవిలోని జంతువుల పిల్లలన్నీ ఎలుగాయి ఏమి విశేషాలు తెస్తాడోనని రాత్రీ పగలూ ఆత్రంతో గడుపుతున్నాయి.

ఒక నెలరోజులు గడిచాయో లేదో, ఒకనాడు ఎలుగాయి అడవిలో కనుపించాడు. మొదట వాడి స్నేహితులెవరూ వాడిని గుర్తుపట్టలేదు. వాడి కాళ్ళకూ చేతులకూ ఏవో గజ్జలూ పూసలూ కట్టి ఉన్నాయి. మెడకు ఒక తెగిపోయిన తాడు ఉంది. సన్నగా చిక్కిపోయి పలుకరిస్తే ఏడిచేలాగా ఉంది వాడి ముఖం.

ఇంతలో జంతువుల పిల్లలన్నీ ఈ విషయం తెలిసి పరుగు పరుగున వచ్చి ఒక సభ ఏర్పరచి దాంట్లో ఎలుగాయిని మాట్లాడమన్నాయి.

ఎలుగాయి మాట్లాడాడు. "నేను మా అమ్మనూ నాన్ననూ ఎదిరించి మనుష్యులతో జీవించాలని వెళ్ళాను. వెళ్ళాక నేను పడ్డబాధలు ఇన్నీ అన్నీ కాదు. నాకు సర్కసువాళ్ళు ఆకలి వేసినప్పుడు తిండిపెట్టేవాళ్ళు కాదు. బాగా ఆకలిగా ఉన్నప్పుడే ఏవేవో మొగ్గలు వేయమనేవాళ్ళు. వాళ్ళ భాష నేను అర్థం చేసుకోలేకపోతే నన్ను చచ్చేటట్టు కొట్టేవాళ్ళు. నా ఒళ్ళు చూడండి. ఎన్ని దెబ్బలు తగిలినాయో! మనం జంతువులం వాళ్ళు మనుష్యులు. వాళ్ళతో మనకు

స్నేహం ఎట్లా ఏర్పడుతుందీ? వాళ్ళు సుఖంగా మంచాలమీద పడుకున్నా హాయిగా కుర్చీలమీద కూర్చున్నా, అందమైన బట్టలు కట్టుకున్నా, మనని మాత్రం జంతువులుగానే చూస్తారు. వాళ్ళకు తోచింది తోచిన వేళకు పెడతారు. మనకు తోచినప్పుడు అటూ ఇటూ తిరగడానికైనా వీలులేకుండా తాళ్ళతో కట్టేస్తారు. అక్కడ ఉన్ననాళ్ళూ ఈ అడవిలోని మీరందరూ జ్ఞాపకం వచ్చి ఏడవని రోజులేదు. మా అమ్మానాన్నా నా గురించి ఎంతగా విచారిస్తున్నారోనని బెంగపెట్టుకున్నాను. ఇక ముందు వాళ్ళు చెప్పినట్లే విని ఇంకెక్కడికి పోకుండా ఉండాలని అనుకుంటూ వచ్చాను. ఇక్కడికి రావడానికి చాలా కష్టపడి తప్పించుకోవలసి వచ్చింది.

సభలో నుండి ఏనుగాయి "మరైతే నువ్వు ఇక్కడి కెట్లా రాగలిగావురా?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

ఆ సర్కసు వాళ్ల పిల్లవాడు రోజూ నాతో ఆడుకునేవాడు. వాడిని నా మెళ్లో తాడు ఒక్కమారు విప్పమని బతిమాలాను. వాడు విప్పడం చేతకాక తాడు కోసేశాడు" అని చెప్పి ఎలుగాయి కాసేపు ఏడిచాడు.

"అమ్మానాన్నా మనుష్యుల దగ్గరకు ఎందుకు పోవద్దన్నారో ఇప్పుడు బాగా తెలిసింది" అని కూడా అన్నాడు ఏడుపుమాని.

సభకు వచ్చిన చిన్న జంతువులన్నీ శ్రద్ధగా ఎలుగాయి చెప్పినదంతా విన్నాయి.

మనం "పెద్దవాళ్ళమయేదాకా అమ్మానాన్నా మాట వినాలి" అని అనుకున్నాయి.

# మచ్చపిల్లి కథ

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక ముసలమ్మ ఇంట్లో ఒక పిల్లి ఉండేది. అది ఒకసారి నాలుగు బుల్లి పిల్లలను పెట్టింది. అవి చాలా ముద్దుగా తెల్లగా ఉండేవి. వాటిలో ఒకదానికి మాత్రం ఎడమ చెవి మీద ఒక చిన్న నల్లని మచ్చ ఉండేది. ఆ నాలుగు పిల్లి కూనలలోకి చెవిమీద మచ్చ ఉన్నది అతి చురుకైనది. అది ఎప్పుడూ మిగిలిన మూడింటిని తోసి పారేసేది. ఒక్కొక్కసారి అవి మూడు పడుకుని ఉంటే ఈ మచ్చ ఉన్న కూన పోయి వాటిని గోళ్ళతో పీకి లేపేది.

ఆ కూనలు నాలుగూ కాస్త పెద్దవైనాయి. వాటిని వదిలిపోయి వాటి తల్లి రాత్రల్లా తిరిగి తిరిగి పొద్దున వచ్చేది.



ఒకనాడు తల్లి వెళ్ళిపోగానే చెవిమీద మచ్చ ఉన్న పిల్లికూనకు పెత్తనాలు చెయ్యాలని బుద్ధిపుట్టింది. "అలా అలా పోయి హాయిగా తిరిగి వద్దాం రండి" అని మిగిలిన మూడు కూనలను అడిగింది.

"అమ్మలేకుండా మేము రాం. నువ్వు కూడా పోకు ఎవరేనా ఏదైనా చేస్తారు. దారి తెలియకపోతే మళ్ళీ ఇంటికి రాలేం" అన్నాయి. "మీరెప్పుడూ ఇంతే, ఉత్తపిరికి దద్దమ్మలు. ఎప్పుడూ ఇంట్లో మూల కూర్చుంటారు. మీరు రాకపోతే నేనొక్కదాన్నే పోతాను లెండి" అని బయలుదేరింది.

ఆ రాత్రల్లా తెగ తిరిగింది. దారిలో చాలా పొలాలు వచ్చాయి. వాటిలో కనిపించిన మొక్కనల్లా కొరికి రుచి చూసింది. ఒకచోట దురదగుంటాకును కొరికింది. గంటసేపటి దాకా నోరు ఒకటే దురదపెట్టింది "మ్యావ్, మ్యావ్" అని అరిచింది. దానిగోల వినేవాళ్ళు ఎవ్వరూ అక్కడ లేరు.

అంతటితో దానికి బుద్ధిరాలేదు. "ఇంటికి తిరిగివెళ్దాం, అమ్మ దగ్గరకు పోదాం" అని దానికి తోచనే లేదు. ఇంకా అక్కడా ఇక్కడా స్వేచ్ఛగా తిరగాలనే అనుకుంది. కళ్ళు మూసుకు ఎగురుకుంటూ పోయింది. పోయిపోయి ఒక బురద గుంటలోపడింది.

"మ్యావ్, మ్యావ్" మని జాలి వేసేటట్టు మొత్తుకుంది. కాని ఎవ్వరూ దాని గోల వినలేదు. చాలా కష్టపడి ఎలాగైతేనేం ఆ బురద గుంటలో నుండి పైకి వచ్చింది. ఒళ్ళంతా బురద ఐంది. చక్కటి పట్టువంటి తెల్లజుట్టు ఏమీ కనపడలేదు. అది చూసుకుని "మ్యావ్, మ్యావ్" అని కాసేపు ఏడిచింది. కాసేపు నేల మీదపడి అటూ ఇటూ దొర్లింది. ఇంకా ఇంత దుమ్ము ఒంటి నిండా పట్టింది. తెల్లవారి బాగా వెలుగు వచ్చింది.

ఏమీ తోచక కొంతసేపు కూర్చుంది. అమ్మ దగ్గరకు పోతాను కాసేపు తిట్టినా ఒళ్ళంతా నాకి శుభ్రం చేస్తుంది అనుకుంది. ఇంతలోకే ఒక ఒడ్లురాశి కనపడింది. దానిని చూచి ఏమనుకుందో ఏమో పరుగుపరుగున పోయి దానిని ఎక్కడం మొదలు పెట్టింది. సగందాకా ఎక్కి కిందకి జర్రున జారింది. ఇట్లా రెండు, మూడుసార్లు జారేసరికి ఒంటిన ఉన్న తడి బురదకు ఒడ్లు దట్టంగా అంటుకున్నాయి.

దానికి పిచ్చి ఎక్కినట్లైంది. మ్యావ్ మ్యావ్ మంటూ దూరంగా ఆడుకుంటూ ఉన్న పిల్లల గుంపు దగ్గరకు పోయింది. ఒక చిన్న అమ్మాయి దానిని పట్టుకుని "అన్నా, నాకు పిల్లికూన దొరికింది" అని కేకవేసింది. వాళ్లన్న దానిని చూచి "ఛీ, అది మురికిగా ఉంది. ఇంటికి తీసుకుపోయి స్నానం చేయించేదాకా ఎత్తుకోకు" అన్నాడు. "మరి దానిని ఇంటికి తీసుకు వెళ్ళటం ఎలాగ?" అని చెల్లి అడిగింది. అన్న కొంచెం సేపు ఆలోచించాడు. ఆలోచించి అటూ ఇటూ చూచాడు.

ఇంతట్లోకి పిల్లలంతా ఆట ఆపి చుట్టూ మూగారు. "ఒకతాడు వెదకండి. పిల్లి మెడకు కట్టి ఇంటికి తీసుకుపోదాం" అన్నాడు అన్న. ఒక చిన్న తాడు తెచ్చి దాని మెడకు కట్టి అన్నా చెల్లీ ఆ పిల్లికూనను తమ ఇంటికి లాగుకుపోతున్నారు. పిల్లలంతా చప్పట్లు కొడుతూ కూడా పోయారు.

ఇంటికి వెళ్లాక పిల్లి కూనకు నీళ్లుపోసి, సబ్బుతోరుద్ధి, బురదంతా కడిగి వేశారు. పిల్లికూన చలితో వణికిపోయింది. అప్పుడు అన్నా చెల్లీ ఒక పాతబట్ట తెచ్చి దానిని నెమ్మదిగా తుడిచారు. దాని మెడకొక చిన్న తోలుబెల్టు కట్టి, ఒక స్తంభానికి కట్టివేశారు. దాంతో పిల్లికూన ఉత్సాహమంతా ఉడిగిపోయింది. "ఇంక తల్లి దగ్గరకు పోవడం కాదుకదా ఇష్టం వచ్చినట్లు తిరగడానికి కూడా వీలేలేదు. ఆకలి తెగవేస్తోంది. ఇంక అమ్మ దగ్గరకు పోనేలేదు!" అని భయం వేసింది. "మ్యావ్ మ్యావ్, మ్యావ్ మ్యావ్" అని అంతులేకుండా ఏడుపు మొదలు పెట్టింది.

పనిమనిషి ఇల్లు చిమ్ముతోంది. పొద్దున్నే దానికి ఈ పిల్లిగోల అసహ్యం అనిపించింది.

చీపురుతో ఒకటివేసి "ఊరుకో, వెధవ గోలా నువ్వూను" అని కోపపడింది. పిల్లి పిల్లకింకా భయంవేసింది. "ఈ ముసలి దానికన్న ఆ పిల్లలే మంచివాళ్ళు" అనుకుని "మ్యావ్ మ్యావ్" అని వాళ్ళకోసం అరిచింది.

అన్నా చెల్లీ దానిగోల ఎక్కువ కావడం విని పరుగున వచ్చారు. "పాపం దానికి ఆకలి వేస్తోంది గాబోలు" అని ఇంట్లోకిపోయి కాఫీ కాచే వాళ్ళమ్మనడిగి కాసిని పాలు తెచ్చి ఒక కొబ్బరిచిప్పలో పోసి దాని ముందు పెట్టారు. తల్లి కోసం బెంగ పెట్టుకుని ఏడ్చే పిల్లిపిల్లకు పాలుతాగాలనిపించలేదు. అది వాటిని ముట్టనే లేదు.

క్రమంగా పొద్దెక్కింది. రోజూ తల్లి డొక్కలో పడుకుని నిద్రపోయేవేళ ఐంది. అది తలచుకుని ఇంకా భయపడింది. గొంతెత్తి అంతు లేకుండా "మ్యావ్ మ్యావ్" అని ఒకటే ఏడుపు మొదలెట్టింది. దానికి ఏమి కావాలా? అని పిల్లలిద్దరూ చాలా ఆలోచించారు. "పాపం చలివేస్తోందిరా అన్నయ్యా దానికేదైనా చొక్కా తొడగాలి" అంది చెల్లి "అంత చిన్న చొక్కా ఎక్కడుందే మన దగ్గర?" అన్నాడు అన్న.

"మా బడిలో కుట్టు నేర్పుతారుగా, నేను బొమ్మకు కుట్టిన చొక్కా ఒకటి ఉంది అది సరిపోతుందేమో అంది చెల్లి. "తే చూద్దాం" అన్నాడు అన్న.

చెల్లి చొక్కా తెచ్చింది. ఇద్దరూ కలిసి దానికా చొక్కా బలవంతాన తొడిగారు. పిల్లి కూనకు చొక్కా తొడుక్కునే అలవాటు లేదుకదా! పైగా చొక్కా కొంచెం బిగువైంది. అందుకని దానికి మరీ చీకాకు పుట్టింది. "మ్యావ్, మ్యావ్" అంటూ గోల మొదలు పెట్టింది. అన్నా చెల్లీ మాత్రం "తెల్లని పిల్లికి ఎర్రని చొక్కా ఎంతో బాగుంది" అని చాలా ఆనందించారు.

చెల్లికి దానిని ఇంకా అలంకరించాలనిపించింది. తన బొమ్మల గదికి పోయి ఎన్నో సామానులు తెచ్చింది. బొమ్మల చేతులకు, మెడకూ కట్టే రంగు రంగులపూసలు తెచ్చి పిల్లికూన మెడకు, కాళ్ళకు కట్టింది. అప్పుడది ఇంకా ముద్దుగా కనిపించింది. "బొట్టూ కాటుకాకూడా పెట్టాలి. మా బుల్లిపిల్లికి" అంది. అన్న "బలే బలే చాలా బాగుంటుంది" అన్నాడు. బొట్టూ కాటుక పెట్టి చెల్లి అద్దం చూపెడుతూ "చూచుకో అమ్మా ఎంత బాగున్నావో!" అంది.

పిల్లిపిల్లకు అద్దంలో తన అవతారం చూచుకునేసరికి ఎంతో ఏడుపువచ్చింది.

"మ్యావ్ మ్యావ్" మని ఇల్లు ఎగిరిపోయేటట్టు అరచింది. ఆ గోల విని ఆ పిల్లల అమ్మా నాన్నా వచ్చారు. చక్కగా పెండ్లికూతురులా అలంకరింపబడిన ఆ పిల్లి పిల్లను చూచి పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకున్నారు. పిల్లికూన "మ్యావ్" అని ఎగిరింది. దాని మెడలో బెల్టుకున్న గజ్జెలు ఘల్ ఘల్మని మోగుతున్నె. పెద్దవాళ్ళకు కూడా ఆ పిల్లికూన భలే గమ్మత్తుగా ఉంది.

కాని పిల్లల అమ్మానాన్నా ఎక్కువ సేపు నవ్వలేదు. "మనకు మల్లే అలంకరించితే పిల్లికి ఇష్టం ఉండదు. ఎలా బాధపడుతోందో పాపం చూశారా? అందుకే మీరు పోసిన పాలు అది తాగనేలేదు. అట్లా పిల్లికూనలను హింసించరాదమ్మా! అది ఇంకా చిన్నది వాళ్ళమ్మను వదలి ఉండలేదు ఎలా తప్పిపోయిందో పాపం వదిలి వెయ్యండి" అన్నారు. అది విని పిల్లలిద్దరూ కూడా "పాపం వదిలి వేద్దాం వాళ్ళమ్మా నాన్నా దగ్గరకు పోతుంది" అన్నారు. మళ్ళీ చెల్లికి

ఒక సందేహం వచ్చింది. "ఇంక కాసేపటికి రాత్రివచ్చి చీకటి పడుతుంది దానికి దారి కనపడదు. కనుక రేపు పొద్దున్నే వదిలేద్దాం" అన్నది. "పిల్లికి రాత్రే కళ్ళు బాగా కనపడతాయటే మాసైన్సు పుస్తకంలో రాసి ఉంది" అని అన్న అన్నాడు. అన్న తనను హాస్యం చేస్తున్నాడనుకుని చెల్లి వాళ్ళ నాన్నకేసి చూచింది. "ఔనమ్మా నిజమే పిల్లులకు పగలు కన్న రాత్రే కళ్ళు బాగా కనపడతాయి. అదిగో చూడు! దాని కంటిపాపలు ఎట్లా సన్నగా ఉన్నాయో. రాత్రి అవే పెద్దగా ఔతాయి" అన్నాడు. "ఐతే వదిలేద్దాం" అని బెల్టుకు కట్టినతాడు విప్పింది. కట్టు విప్పడంతోటే "బతికానురా దేవుడా" అనుకుని పిల్లిపిల్ల ఒక్క గెంతు గెంతి పారిపోయింది. పిల్లలు చేసిన అలంకారాలు దాని ఒంటిని అట్లాగే ఉండిపోయాయి. పిల్లి కూనకు దారి తెలియడం ఎంతో కష్టమైంది.

రాత్రల్లా "మ్యావ్, మ్యావ్" మంటూ తిరిగి, తిరిగి ఎంతో కష్టంమీద తెల్లవారేసరికి ఇల్లుజేరుకుంది.

దాని అవతారం అలంకారం చూచి తల్లీ మిగిలిన మూడు కూనలూ ఆనవాలు పట్టక "ఘర్ ఘర్" మని పోట్లాటకు వచ్చాయి. "నేనేనే అమ్మా" అన్నట్లు మచ్చపిల్లి తల్లిని చూచి జాలిగా "మ్యావ్ మ్యావ్" అని ఏడ్చింది. ఆ ఏడ్పువిని గొంతు గుర్తించి తల్లిపిల్లి ప్రేమతో డొక్కలోకి తీసుకు నాకింది. "అమ్మయ్య ఇప్పటికి మా అమ్మ దొరికింది" అనుకుని ఒక్కసారి బావురుమని ఏడ్చింది. "అట్లా ఒక్కదానివి ఎక్కడకూ పోకూడదమ్మా నువ్వింకా పాలుతాగే పిల్లదానివి. అని తల్లి ప్రేమతో చెప్పింది.

మచ్చపిల్లికి బాగా బుద్ధి వచ్చింది. "అమ్మను వదలి ఇంకెప్పుడూ పోకూడదు" అని చెంపలు వాయించుకుంది. తల్లి డొక్కలో దగ్గరగా పడుకుని కడుపునిండా పాలుతాగి నిద్రపోయింది.

అప్పటి నుంచీ మిగిలిన మూడు పిల్లలతోటీ పోట్లాడడం కాని అల్లరి చేయడం కాని మానుకుంది.

# తమ్ముడు మంచివాడు

"తమ్ముడుపుడితే ఏడుస్తావెందుకే?" అన్నది అత్త. "అమ్మనన్ను ఎత్తుకోలేదు" అని ఏడుస్తోంది ఛాయ. "ఐతే తమ్ముడిని నేను తీసుకుపోనా?" అని నవ్వుతూ అడిగింది అత్త.

మళ్ళీ అదీ ఇష్టం లేదు ఛాయకు. "ఆ వద్దు" అన్నది. అత్త మళ్లీ నాలుగైదుసార్లు "నేను తీసుకుపోతా" అన్నది. "వద్దు" అని అంతకంతకు గట్టిగా అన్నది ఛాయ. ఏడుపుకూడా మరచిపోయింది.



అప్పుడే తమ్ముడిని స్నానం చేయించడానికి ఎత్తుకుంది ఛాయావాళ్ళ అమ్మ. "ఛాయా, తమ్ముడు చూడు నీవంకే చూస్తున్నాడు" అన్నది నవ్వుతూ. తమ్ముడు ఛాయవంక చూశాడు.

ఛాయ కూడా నవ్వింది. తమ్ముడు బాగానే ఉన్నాడు. కాని తమ్ముడు పుట్టినప్పటి నుంచి అమ్మ తనను ఎత్తుకోవడం లేదు. అందుకని "తమ్ముడిని దింపెయ్యి నన్నే ఎత్తుకో" అని కాళ్లకు అడ్డువచ్చింది. "తప్పమ్మా నువ్వు పెద్దదానివి. తమ్ముడు చిన్నవాడు. వాడికి ఆడుకోవడం కూడా చేతకాదు. చూడు అక్కయ్యవని నిన్నే ఆడించమంటున్నాడు. వాడి గిలకలూ బొమ్మలూ అన్నీ నువ్వే తీసుకొని వాడికి ఆట నేర్పాలి" అన్నది వాళ్ళ అమ్మ. తమ్ముడు మళ్లీ నవ్వాడు. ఛాయ గిలక వాయించింది. చేతులు కొట్టుకుంటూ చాలాసేపు నవ్వాడు తమ్ముడు. "ఆ కీచు బొమ్మ నాది" అన్నది ఛాయ. "అన్నీ నీవే తమ్ముడికిచ్చి నువ్వే ఆడించు" అన్నది అమ్మ.

"మరి తమ్ముడు లాక్కోడూ?" అని అడిగింది ఛాయ. "వాడింకా చిన్నవాడు. నీ దగ్గర లాక్కోడు" అన్నది అమ్మ. నిజంగా ఛాయ బొమ్మలన్నీ తీసుకున్నా తమ్ముడు నవ్వుతూనే ఉన్నాడు. "తమ్ముడు మంచివాడు" అని ముద్దు పెట్టుకుంది ఛాయ.

# కాకరపువ్వు వత్తి

దీపావళి పండుగ వచ్చింది. గోపి, శ్రీను, చిట్టి, ఛాయ సాయంకాలమయేసరికి కొత్త బట్టలు తొడుగుకొని, ముస్తాబయి కూర్చున్నారు. వాళ్ళ నాన్న బజారు వెళ్ళారు ఎందుకో.

టపాకాయలు కొనేసి అప్పుడే నాలుగు రోజులైంది. వాటిలో కొన్ని కాలిపోయాయి కూడా.




గోపికి పదేళ్లు, శ్రీనుకు ఎనిమిదేళ్లు, చిట్టికి ఐదేళ్లు ఛాయకు మూడేళ్లు. గోపి శ్రీనూ "తాటాకు టపాకాయలు కాలుస్తామనీ" "సీమటపాకాయలు కాలుస్తామని" అని ఊరికే గంతులు

వేస్తున్నారు. చిట్టి "కారకరపువ్వువొత్తులు, మతాబాలు మాత్రమే కాలుస్తాను" అన్నది. అంతకన్న పెద్దవి కాల్చడానికి భయమని ఒప్పేసుకుంది.

ఇక ఎటొచ్చీ ఛాయ మిగిలింది. దానికి అన్నీ కాల్చాలనే ఉంది. కాని ఇంకా చిన్నది కనుక ఏది కాల్చడానికీ భయమే. అందుకని రోజల్లా దేనికో ఒకదానికి పేచీ పెడుతోంది. పండుగ బట్టలు వేసీ వెయ్యడంతోటే ఏడుపు మొదలు పెట్టింది. మొదట ఏదో కుట్టిందనుకున్నారు. చాలాసేపు ఆడించి ఆడించి విసుగెత్తారు అంతా.

చిట్టిమాత్రం ఛాయను ఆడించాలనుకుంది. "చెల్లాయీ ఏంకావాలమ్మా" అని అడిగింది. అప్పుడు చిట్టి గౌను మెడవంక చూపించి "అది నాకు లేదూ" అని మళ్ళీ కంఠం ఎత్తింది.

చిట్టి గౌనుకు నీలం అంచు కుట్టాడు దర్జీవాడు. ఛాయ గౌనుకు కుట్టలేదు. ఛాయ చూపించి ఏడ్చేదాకా అది ఎవ్వరూచూడలేదు. అప్పుడంతా ఒక్కసారి నవ్వుకుని "నీలం రంగు అంచువల్ల చిట్టి గౌను ఏమీ బాగాలేదు. నీ గౌనే చాలా బాగుంది." అని నచ్చచెప్పారు. ఛాయ సందేహంతో చిట్టివంక చూసింది. చిట్టికూడా నవ్వుతూ ఒప్పుకుంది. అప్పటితో ఛాయపేచీ తీరింది.

ఆవేళ సాయంకాలం ఎవరో స్నేహితులూ, చుట్టాలూ చూడవచ్చారు. వాళ్ళ ఇంటికి. ఛాయ, వాళ్ళ అమ్మ చాటున దాక్కుంది. సిగ్గు వేసి.

కాసేపుండి లోపలికి పోయింది. ఇంకా కాసేపటికి గొల్లుమని ఛాయ ఏడుపు వినపడింది. అంతా పరుగున లోపలికి వెళ్ళారు. ఛాయ ఒక ఖాళీ బిందెలో దిగి నుంచుని ఉంది. పైకి రాలేక ఏడుస్తోంది. వాళ్ళమ్మ మెల్లగా పైకితీసి ఎత్తుకుని ముద్దు పెట్టుకోగానే ఏడుపుమాని సిగ్గుతో తలవంచుకుంది ఛాయ.

ఇళ్ళల్లోను, వీధులలోను ప్రమిదలు వెలిగించారు అంతా. ఎంతో అందంగా ఉంది. ఆరు గంటలు దాటింది. టపాకాయల సంబరం మొదలైంది. అంతా అన్నీ వెలిగిస్తున్నారు. ఛాయ కాకరపువ్వువత్తి ఒకటి వెలిగించింది. దాని పువ్వులు చిందటం చూచి ఆమెకు భయం పట్టుకుంది.

కాని కాకరపువ్వువత్తి పారవేస్తుందేమో అంటే పార వెయ్యదు. ఏడుపు మాత్రం మొదలు పెట్టింది. అప్పుడు వాళ్ళ నాన్న దగ్గరకు వచ్చి భయం లేదులే అమ్మా, ఆ పువ్వులు కాలవు, ఇదిగో చూడు అని చేతి మీద ఆ పువ్వులు పడేటట్టు చెయ్యిచాపారు. ఛాయ ఆశ్చర్యంతోటి ఆనందం తోటి చూసింది. వరసగా ఎన్నో పువ్వు వత్తులు కాల్చేసింది.

# రైలు ఆట

ఆ వేళ ఆదివారం. ఛాయకు బడిలేదు. మధ్యాహ్నం అమ్మానాన్నా నిద్రపోతున్నారు. ఛాయకు నిద్ర రాలేదు.

దాని వయస్సు నాలుగేళ్లు. ఎదురింటి బుజ్జిగాడికి కూడా నాలుగేళ్లే. పక్కింటి లీలకు ఐదేళ్లు. బుజ్జిగాడి చెల్లెలు లక్ష్మికి రెండేళ్లన్నర. వాళ్ల ఇండ్లల్లోనూ అంతా పడుకున్నారు. కాని వాళ్లకూ నిద్ర పట్టలేదు. అందుకని ఛాయతో ఆడుకోటానికి వచ్చారు.




వాళ్ళంతా ఏమాడుదామని ఒకరి నొకరు అడిగారు. ఏమీ తోచలేదు. ఈ లోగా లక్ష్మికి ఎదురు గదిలో కుర్చీ కనపడింది. అది పేముకుర్చీ. దానిని బోర్లావేసి 'జిగ్, జిగ్' అంటూ తోస్తూ ఆట మొదలు పెట్టింది.

'బలే బాగుంది' అనిపించింది. అంతా తలొక కుర్చీని బోర్లవేసి రైలాట మొదలు పెట్టారు.

'జిగ్ జిగ్!'

'కూ.......'

ఛాయకు మొన్ననే వాళ్ళ నాన్న ఈల కొనిపెట్టారు. అది తెచ్చి నేను గార్డునట, ఈ ఈల ఊదుతానుట, అప్పుడు మీరైళ్ళన్నీ నడుస్తాయట!" అని ఉత్సాహంగా ఈల ఊదింది.

ఈలోగా లక్ష్మిని చీమకుట్టింది. అది ఏడుపు మొదలు పెట్టింది. ఈ గోలంతా విని ఛాయ అమ్మా, నాన్నా లేచివచ్చారు. ఆ గది సామానులన్నీ చిందర వందరగా ఉన్నాయి. బల్లమీది కాగితాలూ పుస్తకాలూ నేలమీద దొర్లుతున్నాయి.

ఛాయ తల్లి లక్ష్మిని "ఊరుకో అమ్మా" అని ఎత్తుకున్నది. అది ఊరుకుంది. లక్ష్మిని తీసికొని వాళ్ళ అన్న చల్లగా జారాడు.

లీల అమ్మకు కూడ ఈ గోల వినపడింది ఆమె లీలను పిలిచింది. అది కూడా వెళ్లిపోయింది. "తప్పుకాదూ, వాళ్లింట్లో అల్లరి చేయవచ్చా?" అని లీలను కోపపడితే, "అది అల్లరి చెయ్యలేదండి, లక్ష్మిని చీమ కుడితే ఏడ్చింది" అని ఛాయ తల్లి చెప్పింది.

ఇక ఛాయ ఒక్కతే మిగిలింది. వాళ్ళ నాన్నగారు కిందపడ్డ కాగితాలు తీసుకుంటూ "అయ్యో ఆఫీసు కాగితాలు ఇంకా చింపివెయ్యలేదు, నయం" అంటూ ఛాయకేసి నవ్వుతూ చూశారు. ఛాయ బిక్కముఖం వేసింది. వాళ్ళమ్మ దానికేసి చూస్తూ "చూడు ఎంత అల్లరిచేశావో!" అంటూ కోపపడింది. "మరి అల్లరి చెయ్య లేదన్నావుగా లీల అమ్మతోటి?" అంది ఛాయ భయపడుతూ. వాళ్ళమ్మా నాన్న నవ్వుకుని "ఇంకెప్పుడూ ఆఫీసుగదిలో ఆడకండి" అన్నారు. ఛాయ బుర్ర ఊపింది.

మర్నాడు ఛాయ నాన్నగారు ఆమెకొక కీ ఇస్తే నడిచే రైలు బండి కొనిపెట్టారు. లీలకు, బుజ్జికి, లక్ష్మికి చూపించి ఛాయ హాయిగా వరండాలో అందరితో ఆడుకుంది ఆ రైలుతో.

# నాకే తెలుసు, నాకేం తెలుసు

శ్రీనుకి ఎనిమిదేళ్ళు. ఛాయ అతని చెల్లెలు. దానికి ఐదేళ్ళు. ఇద్దరూ ఒకే బళ్ళో చదువుతున్నారు. "అన్నీనాకే తెలుసు" అనే అలవాటు శ్రీనుది. అందుకని అతన్ని అంతా "నాకే తెలుసు" అనేవారు. ఛాయ మాట్లాడితే "నాకేం తెలుసు?" అంటూ ఉంటుంది. అందుకని ఆమెకాపేరు వచ్చింది.

ఒకనాడు బడి పిల్లలనందర్నీ జంతు ప్రదర్శనశాలకు తీసుకువెళ్ళారు. నాకే తెలుసు, నాకేం తెలుసు చెట్టాపట్టాలతో వెళ్లారు.



పంతుళ్ళు బడిపిల్లలను బారులు కట్టి జాగ్రత్తగా అన్ని మూలలకూ తీసుకువెళ్తున్నారు. రకరకాల జంతువులనూ పక్షులనూ చూపించారు. పిల్లలకు ప్రతీచోటా ఇంకా నిలబడాలనే ఉంది. కాని వేళ చాలదని పంతుళ్ళు తొందరగా తీసుకుపోతున్నారు. నాకేం తెలుసుకు ఏనుగును చూడటమంటే బలే సరదా. "చూసిన కొద్దీ చూడాలనుంది, శ్రీనూ" అంది నిమ్మళంగా అన్నతో "ఐతే చల్లగా వెనక్కి జారు" అన్నాడు నాకే తెలుసు.

ఎవ్వరూ చూడకుండా ఇద్దరూ వెనక పడ్డారు. "మరి అంతా వెళ్ళిపోతారేమో మనకి దారేం తెలుసు?" అంటూ భయపడింది నాకేం తెలుసు. "నాకు తెలుసు" అన్నాడు నాకే తెలుసు. వాళ్ళు కాసేపు ఎదురుగాను, కాసేపు వెనకా, కాసేపు పక్కగాను నిలబడి ఏనుగును పరీక్షగా చూశారు.

చీకటి పడింది. నాకేం తెలుసు, "ఇంటికి పోదాంరా అన్నయ్యా" అంది. కాని బడిపిల్లలు కాని, పంతుళ్ళుకాని ఎక్కడా కనుపించలేదు. "మళ్ళీ, మనం ఒక్కళ్ళమూ ఇంటికి పోగలమా?" అంది నాకేం తెలుసు. "భయపడకు, పోలీసు లెవరైనా ఉంటే ఇంటికి పంపించమని అడుగుదాం" అన్నాడు నాకే తెలుసు. "ఐతే నీకు దారి తెలియదా?" అని బిక్కుబిక్కుమంది

చెల్లాయి. ఆమెకు పోలీసులంటే భయం. "నాకు తెలుసులే, ఐనా చీకటిగా ఉందని" అంటూ చెల్లి చెయ్యి పట్టుకుని ముందుకు నడిచాడు నాకే తెలుసు.

జంతు ప్రదర్శనశాలలో ఒక పోలీసు స్టేషను ఉంది. ఒక పోలీసు గడపలో కొయ్యబొమ్మలా నుంచున్నాడు. నాకేం తెలుసు అతనికి అవతల పక్కను లోపలి ఒకాయన కుర్చీలో కూర్చుని కాగితాలు చూసుకుంటున్నాడు. చుట్టూ పెద్ద పెద్ద తుపాకులు గోడకు అమర్చి ఉన్నాయి. నాకేం తెలుసుకు చాలా భయం వేసింది. అన్న చెయ్యి గట్టిగా పట్టుకుంది.

నాకే తెలుసు తమ కథ చెప్పి ఇంటికి పంపమని అడిగాడు. "చిన్న పిల్లలు అలా విడిపోవచ్చా" అని ఆ పోలీసు ఉద్యోగి వాళ్ళకేసి గట్టిగా చూశాడు. లోపల మాత్రం "తెలివైన పిల్లలే" అనుకున్నాడు. నాకే తెలుసు ఏమీ మాట్లాడలేదు.

వాళ్ళ నాన్నగారి పేరు అడిగి ఫోనుచేసి అద్దె మోటారు రప్పించి ఇద్దరిని జాగ్రత్తగా ఇంటికి పంపేశాడు.

ఇంట్లో అడుగుపెట్టగానే నాకేం తెలుసు అమ్మ ఒడిలో పడి ఏడ్చింది. "అక్కడ ఏడుస్తూ కూచోకుండా తెలివైన పనే చేశారు. కాని పాపం పంతుళ్ళు మీకోసం వెతుక్కోరూ?" అంటూ వాళ్ళ నాన్నగారు పెద్ద పంతులింటికి మనిషిని పంపారు.

"మేం యింకెప్పుడూ అట్లా చెయ్యమండి" అని నాకే తెలుసు, నాకేం తెలుసు మర్నాడు బడిలో పంతుళ్ళతో చెప్పారు. పంతుళ్ళు నాకేం తెలుసును ఏమీ అనలేదు కాని నాకే తెలుసును కొంచెం కోపపడ్డారు.



# ముంగిస, తోడేలు

అనగా అనగా ఒక అడవిలో ఒక తోడేలు ఒక ముంగిస ఉండేవి. అవి దగ్గర దగ్గరగా నివసించేవి. అందుకని ఎక్కువ పిట్టల్ని చంపినా, ఎక్కువ కాయలూ పళ్లూ దొరికినా రెండూ కలిసి పంచుకుని సంతోషంగా లొట్టలేస్తూ తినేవి. ఒకనాడు అవి రెండూ వెన్నెట్లో నడుస్తూ కులాసాగా మాట్లాడుకుంటున్నాయి.

ముంగిస – తోడేలమ్మా, తోడేలమ్మా నువ్వు ఎప్పుడైనా పులిహోర తిన్నావా?

తోడేలు – ఓ, పులిహోర తిన్నాను, దాని తాతలాంటి పులావు కూడా తిన్నాను.

ముంగిస – పులావా? దాంట్లో ఆలుగడ్డ ముక్కలూ, (చప్పరిస్తూ) ఇంకా పచ్చి బటానీలూ, లవంగాలూ, అవన్నీ వేస్తారు కదా?



తోడేలు - ఓస్! నువ్వంత కన్నా తిని ఎరుగవు కాబోలు! నే చెప్తా నిను. సీమకోడి మాంసం పెద్ద పెద్ద ముక్కలు చేసి బాగా నెయ్యివేసి వేగించి ఆలుగడ్డ బదులు పలావులో వేస్తే అబ్బ! లొట్టలు వేస్తూ నాకిప్పుడు తినాలనిపిస్తోంది. దానిలో టమాటోపళ్లూ పచ్చి బటానీలూ, ఇంకా కొత్తిమీర మంచి తాజావి వెయ్యాలి. ఓ, అది తింటేనా స్వర్గానికి బెత్తెడు దూరంలో ఉంటామనుకో. అంత రుచిగా ఉంటుందా సీమకోడి మాంసపు పులావు!

ముంగిస - ఆ పులావు నాక్కూడా తినాలని ఉంది తోడేలమ్మా. దానిని గూర్చి వింటుంటేనే నానోరు ఇంతగా ఊరుతోంది మరి తింటే ఎంత బాగుంటుందో కదా!

తోడేలు - అదే నే చెప్పేది సీమకోడి రుచి మరి దేనికీ లేదు. నేను జీవితంలో ఎన్నో జంతువుల మాంసాన్నీ పిట్టల మాంసాన్నీ తిన్నాను గాని, ఈ సీమ కోడి మాంసంతోటి ఏదీ సాటికాదు. ఇప్పుడే ఆ పులావు తినెయ్యాలని ఉంది నాకు. కాని ఎట్లా వస్తుంది?

ముంగిస - పోనీ మనం చేసుకు తిందామా?

తోడేలు - నీ ముఖం, సీమకోడి ఎక్కడ నుండి వస్తుంది ఉన్నట్లుండి? (విసుక్కుంది తోడేలు)

ముంగిస – అది కాదు తోడేలమ్మా పక్క ఊళ్ళో చాలా మేడలున్నై – అక్కడి వాళ్ళు కోళ్లను పెంచుతారు. మనం పోయి ఎక్కడైనా ఒకదాన్ని వెతికి తెచ్చుకోవచ్చుగా?

తోడేలు – అవును. నీ ఆలోచన చాలా బాగుంది. పద పదాం.

సరే అంటే సరే అనుకుని రెండూ బయల్దేరినై. పోయి పోయి పక్క ఊరుచేరినై. అక్కడ ఒక మేడ కనిపించింది. ఆ మేడ వెనుకవైపు నుంచి దొడ్లోకి ప్రవేశించి, ఒక కిటికీలో నుండి లోపలికి తొంగి చూచినై. ఒక బల్లమీద కొన్ని వండిన కోళ్ళు పళ్ళాలలో అమర్చబడి తినేందుకు సిద్ధంగా ఉన్నై. మాంచి వాసన వచ్చింది. ముంగిస ఉండబట్టలేక "తోడేలమ్మా, అవి భలే బాగున్నై కదూ? కమ్మటి వాసన వేస్తున్నవి అవేనా సీమ కోళ్ళు?" అని అడిగింది.

తోడేలు – నీ జన్మలో సీమకోడిని చూచినట్లే లేదే. మన పులావులోనికి పనికి వచ్చే కోళ్ళు ఆ కోళ్ళపాకలో ఉన్నై చూడు – పద అటుపోదాం.

తోడేలమ్మా ముంగిసా రెండూ చేతులు కలుపుకుని ఎంతో ఉత్సాహంగా కోళ్ళ గుడిసెవేపు నడిచినై. కాని అక్కడే ఒక భయంకరమైన కుక్క కోళ్ళకు కాపలా కాస్తోంది. దానిని చూడడం తోటే మన తేడేలూ ముంగిసా గతుక్కుమన్నై. పరీక్షగా చూస్తే ఆ కుక్క నిద్రపోతోందని తేలింది. అవి రెండూ మెల్లిగా రహస్యంగా మాట్లాడుకున్నై.

తోడేలు – ముంగీ, అదుగో ఆ గుంటలోపడుకున్నవే సీమకోళ్ళు అవి లోపల పడుకున్నై. ఆ కుక్కను చూడబోతే మనకు అడ్డం వచ్చేటట్టుంది. మనం మెల్లిగా పోయి మంచి మాటల తోటి మాయబుచ్చి వాటిలోని రెండు కోళ్ళనైనా మన వెంట వచ్చేటట్లు చెయ్యాలి. చప్పుడు కాకూడదు సుమా!

ఇకనేం, అవి రెండూ అడుగులో అడుగులేసుకుని మెల్లగా కుక్కను దాటాయి. కోళ్ళకు దగ్గరగా పోయి మాటలతో వాటిని పైకి రప్పించాలని ప్రయత్నం చేసినై.

తోడేలు – ఆ వెధవ పాకలో పడి ఉంటారేం ఎప్పుడూ? పిండి ఆరబోసినట్లు వెన్నెల కాస్తుంటే?

ముంగిస – ఈ కోళ్ళకు సుఖపడాలనే కోరిక ఉండదేం.

తోడేలు – (రెండడుగులు ముందుకువేసి) ఏయ్, ఏయ్, కోళ్ళూ, మిమ్మల్నే, రండి త్వరగా, ఈ వెన్నెట్లో హాయిగా తిరిగివద్దాం.

ముంగిస – ఏయ్ కోళ్ళూ మాంచి అవకాశం మీలో ఇద్దరైనా రండి సరదాగా తిరిగి వద్దాం.

ఆ కోళ్ళేవీ కళ్ళయినా తెరవలేదు.

తోడేలు – చూడండీ, ఓ కోళ్ళూ వస్తే వెంటనే వచ్చేయ్యాలి సుమా. మళ్ళీ చందమామ మేఘాల చాటుకుపోతే వెన్నెల రమ్మన్నారాదు. మళ్ళీ మీరే విచారిస్తారు.

ఆ కోళ్ళు వీటి మాటలు వింటేగా. మళ్లీ తోడేలూ, ముంగిస వాటిని మాట్లాడించాలని ప్రయత్నించినై.

ముంగిస – ఈ వెధవ మురిగిపోయిన కోళ్ళ గుడిసెలో కాస్తగాలైనా లేకుండా అట్లాగే తెగనిద్రపోతే మీ ఆరోగ్యం తగలబడుతుంది.

తోడేలు – అంత చేటు నిద్రపోతే మత్తెక్కి తెగబలిసిపోతారు.

ఆ కోళ్ళలో నుండి ఒక పెద్దకోడి మగతగా కళ్ళు తెరిచి "పోనిద్దూ మేమెంత లావెక్కినా మాకు బెంగలేదు. ఆరోగ్యం చెడినా మేమీ పాకలోనే ఉంటాం" అని మళ్లీ పలకకుండా పడుకుంది.

మన తోడేలు ముంగిసా తమ ప్రయత్నం మాత్రం మానదలచుకోలేదు.

ముంగిస ఏయ్, అట్లాగే కదలకుండా మెదలకుండా పడుకుని తెగనిద్రపోతే గడ్డం కింద మరో గడ్డం వస్తుంది. రెండు గడ్డాలుంటే అబ్బ ఎంత అసహ్యంగా ఉంటారో తెలుసా?

అయినా ఒక్క కోడైనా ఉలకలేదు పలకలేదు. తోడేలుకు ఉడుకుమోతుతనం వచ్చింది.

తోడేలు – ఇంత మంచి పెద్ద మనుష్యులం వచ్చి మర్యాదగా పిలిస్తే బొత్తిగా మోటుగా ఒక్క మాటైనా విననట్టుగా నటించడం మహా గొప్పకాబోలు!

అప్పుడొక లావాటి కోడి మాట్లాడింది.

....కోడి – పోదురూ! మాకు గడ్డం కింద గడ్డం వచ్చినా మరో రెండు గడ్డాలు వచ్చినా బెంగలేదు. మాకు ఇక్కడే బాగుంది. పైకి రానేరాం.

ముంగిస – మంచి వెన్నెట్లో తిరిగి ఆనందించడం ఈ మొఖాలకు తెలిస్తేగా? ఇదిగో, ఆఖరిసారి చెబుతున్నా తరువాత విచారించి లాభం లేదు. ప్రపంచంలో విచిత్రాలన్నీ చూడాలంటే మాతో రండి లేదా, మీ ఖర్మం మీది, ఉత్తమూర్ఖుల్లాగున్నారు. మేం పోతున్నాం.

ముంగిసా, తోడేలూ వెనక్కి తిరిగినై వెళ్లి పోతున్నట్లు నటిస్తూ. వెంటనే ఆ కోళ్ళలోకల్లా ఒక చిన్నది చటుక్కున లేచింది. దానికి ప్రపంచం అంతా తిరిగి ప్రపంచజ్ఞానం సంపాదించాలని కోరిక పుట్టింది. దాని కాళ్ళు సాధారణంగా ఊరికే ఉండవు. తెగ తిరగాలని ఉంటుందెప్పుడూ. తోడేలూ ముంగిసా ముందు నడిస్తే ఈ చిన్నకోడి వాటి వెనుక నడిచింది. కుక్క కళ్ళు తెరిచి ఒకసారి "హ్రూ" అని మళ్ళీ పడుకుంది. దానితో తోడేలూ ముంగిసా గతుక్కుమని మళ్ళీ తేరుకున్నై. అడుగుల్లో అడుగువేసుకుని కుక్కను దాటేసి పైకి వచ్చినై. వాటితో వచ్చిన చిన్నకోడి ఉత్సాహానికి అంతులేదు. తెగ కబుర్లు చెప్పేస్తోంది. వెన్నెల భలే బాగుందంది. అట్లా రోజూ తిరిగితే భేషుగ్గా ఉంటుందంది.

ఇక మన తోడేలూ ముంగిసా ఆ చిన్న కోడిని తెగ పొగిడేసిన్నై. "నువ్వు చిన్నదానివైనా చాలా తెలివైన దానివి. మీ పెద్ద కోళ్లలాగా నువ్వు మొద్దువు కావులే!" అన్నై.

కోడిపిల్ల - మనం ప్రపంచం చుట్టూ ఎప్పుడు తిరుగుదాం?

తోడేలు - ఓ, ఇప్పుడు అంతా ఆ విమానాల్లో పోయి ప్రపంచకాన్ని ఇట్టే చూసేసి వస్తున్నారు. అదెంత పనిలే.

ముంగిస - మరి నాకు చాలా ఆకలి వేస్తోంది. ఏవైనా కూరలు కోసుకుని పోయి ఇంతకడుపు నిండా తిని మరీ పోదాం. (తోడేలు వంక చూసి కన్నుగీటి అన్నది)

తోడేలు - (ముంగిస వైపు కన్నుగీటి) అవును కాసిని పచ్చి బటానీలూ, టమాటా పళ్లూ, కొత్తిమీర దార్లో పొలంలో దొరుకుతాయి... కోసుకుపోయి ఏమైనా చేసుకుని తినిపోదాం.

పొలంలోకి వెళ్లినై ముంగిసా, తోడేలు. వెంట వెళ్ళిన కోడిపిల్ల ఇదంతా విచిత్రంగా చూస్తూ, తనుకూడా సరదాగా బోలెడు పచ్చి బటానీలు కోసింది. కూరలు పట్టుకుని అడవిలో తోడేలు ఇంటికి వెళ్లారు.

తోడేలు త్వరగా పొయ్యి రాజేసింది. పులావుకు కావలసిన వస్తువులన్నీ వండేసింది. దాంట్లో కమ్మటి నెయ్యి పోసింది. కత్తిచేత్తో పట్టుకుంది తెగ కబుర్లు చెప్తుతున్న చిన్న కోడిని కొయ్యడానికి. ఇంతలో దానికి ఒక ఆలోచన తట్టింది.

తోడేలు - ఏమే ముంగీ! ఈ కోడిపిల్ల ఒక్కరికే చాలేటట్టు లేదుకదా మరి ఇద్దరం ఎట్లా తినగలమే?

ముంగిస - పోనీలే తోడేలమ్మా ఇవాళ్టికి నేను తింటాను. నువ్వు మరోరోజు మళ్ళీ చేసుకుని తిందుగాని.

తోడేలు (కోపంగా) ఇంతావండీ వార్చీ నీకు మెక్కబెడతానటే?

ముంగిస - లేకపోతే కోడి పిల్లను పూర్తిగా నువ్వే తినెయ్యాలని అనుకున్నావా?

అందాక కబుర్లు చెప్తూ పొయ్యిదగ్గరే కూర్చుని, వండేవంటకాల్ని విచిత్రంగా చూస్తున్న కోడిపిల్ల వీటి మాటలువిని గజగజలాడిపోయింది. "అయ్యబాబోయ్! వీళ్ళు నన్ను ఇందుకా తీసుకొచ్చారు!" అనుకుని హడలిపోయింది.

తోడేలూ, ముంగిసా ఇంకా బాగా పోట్లాటలోకి దిగినై.

తోడేలు - నా ఇంట్లో వండేకోడి మాంసపు పులావు నాది గాని నీది ఎట్లాగవుతుంది?

ముంగిస - నన్ను దగా చేసి నువ్వే తినెయ్యాలని చూస్తున్నావా? అసలు నీకు పెట్టకుండా నేనే తినేస్తా చూడు.

తోడేలు - నేను కష్టపడి చేస్తే నువ్వెట్లా తింటావే?

ముంగిస - అబ్బో! నువ్వే కష్టపడ్డట్టు. నేనుండబట్టే అసలా కోడిపిల్ల వచ్చింది తెలుసా?

తోడేలు - నోరు ముయ్యి! నేను నీకు పెట్టకుండా అంతా తినేస్తా ఏం చేస్తావో చెయ్యి.

ముంగిస - ఓయబ్బో నేనేకదా ఇంత పెద్దగా ఉన్నాను నన్నేం చేస్తుందనుకున్నావా? నేనూ నీకు చెప్పగలను బుద్ధి.

తోడేలు - అసలా కోడిని ముట్టుకో! నీ సంగతి చెప్తా!

ముంగిస - ముట్టుకుంటా ఏం చేస్తావో చెయ్యి.

ఇంతలో తోడేలూ ముంగిసా కోడిపిల్ల కూర్చున్నవైపు చూచినై. ఇంకెక్కడి కోడిపిల్ల? అది అప్పుడే హడలిపోయి పారిపోయింది. దాంతో కోడిపిల్ల పోవడానికి నువ్వు కారణమంటే నువ్వు కారణమని పోట్లాడుకున్నై. ఒకళ్ళపై వకరు పడి తన్నుకుంటూ మండే పొయ్యి మీద కాగే నేతిలో పడి మొర్రోమని వక్కసారే చచ్చిపోయినయి.

ఇక కోడిపిల్ల మాటంటారా? అది దాని పాకచేరుకుని "అబ్బ! ఎంత హాయిగా ఉంటుందీ పాకలో. బయటికిపోతే అన్నీ కష్టాలే కదా! ఈ పాక వదలి మళ్ళీ పోను, బాబూ" అనుకుంది.

# గాలిపటం

ఉమతల్లి దొడ్లో పని చేసుకుంటోంది. ఉమ మంచం మీద ఇంకా ఉదయం ఆరుగంటలైనా దొర్లుతూనే ఉంది. కళ్లు మూసుకుంది.

ఇంతలోకి ఆకాశంలో గాలిపటం రంగురంగులది ఎగురుతూ ఉన్నట్టు కనిపించింది. ఉమ గాలిపటం వైపే ఉండడం వల్ల తను ఏవైపుకు సాగిపోతోందో చూసుకోలేదు. కొంత సేపటికి ఒక పూల తోటలో ఉన్నట్టు తెలుసుకుంది. ఎటుచూచినా ఎంత మంచిపూలు! అబ్బ ఇన్ని మంచి పూలు ఒకేచోటుకు ఎలాగ వచ్చాయా అని ఆనందంతో ఆశ్చర్యపడింది. ఒక పక్క ఎర్రనివీ, పసుపుపచ్చనివీ, మరొక పక్క గులాబీవీ, తెల్లనివీ గులాబీలు ఆకు కనిపించకుండా పూసి వున్నాయి. ఇంకా ఎన్నెన్నో రకరకాల పూలూ రంగు రంగుల పూలూ కుప్పలుగా పూచి ఉన్నాయి.

ఉమ పువ్వులు కొయ్యాలని చెయ్యిజాపింది. ఇంతలోకే ఒక చక్కటి అందమైన అమ్మాయి అక్కడికి వచ్చి "ఏయ్ అమ్మాయ్ ఎవరు నువ్వు?" అన్నది. ఆ అమ్మాయిని ఉమ ఇదివరకెన్నడూ చూడలేదు. అంత చక్కని అమ్మాయిని కూడా చూడలేదు. అలాగే నోరు తెరచుకుని ఆశ్చర్యంగా చూస్తోంది. ఆ అమ్మాయి "అదేమిటమ్మా అలా భయపడిపోతావ్? మాట్లాడు నాతో; రోజూ ఆడుకొంటూ స్నేహంగా ఉండవచ్చు" అంది.

అప్పుడు ఉమ కొంచెం తేరుకుని "నా పేరు ఉమ మరి నీపేరో?" అంది. "నా పేరు బాల ఇది మా బడితోట - ఇక్కడ పిల్లలమంతా చేరి అన్ని రకాల మొక్కలూ వేసి పువ్వులు పూయిస్తాం. కాని ఎవరమూ వాటిని కోయనే కోయం పూజకు తప్ప."



ఉమ - "మరి కోసుకోకపోతే పువ్వులెందుకూ" బాల "అయ్యో తోటలో పూలన్నీ కోసేస్తే తోట అందం పోదూ? ఎప్పుడైనా కావాలంటే మూల మూలల్లో ఉన్న పూలు కోసుకోవచ్చును."

ఉమ "మరి మీ బళ్ళో పిల్లలంతా యేరీ? నువ్వు ఒక్కదానివే కనిపిస్తున్నావు?"

బాల - "మా బడి పిల్లలు పొద్దున్నే రారు. వేళకు వస్తారు."

ఇంతలో గాలిపటం కనిపించింది. ఉమకు "అరే ఇంతసేపూ మరిచిపోయానే" అనుకుంటూ దాని వంక చూసింది. ఇంతలో "ఉమా, ఓ ఉమా, మళ్లీ రేపురా" అని బాల కేక దూరాన్నుంచి వినిపించింది. అటు తిరిగి చూసేసరికి తను మళ్లీ గాలిలో గాలిపటంలా తేలిపోయింది. ఎందుకో చాలా సంతోషంగా ఉంది. మళ్ళీ గాలిపటం ఎటుపోతోందో అని చూసేసరికి అక్కడ గాలిపటం లేదు. మళ్లీ కిందకు చూసేసరికి అక్కడ బోలెడు మంది తన యీడు ఆడపిల్లలు ఆడుకుంటున్నారు.

ఉమ ఆ పిల్లల దగ్గరకు పోయి "అమ్మాయిలూ, ఇదే ఊరు?" అన్నది. వాళ్ళు "ఇది నీలినగరం" అన్నారు. ఇంతలో గణగణమని గంట వినిపించింది. అందరూ పరుగుపరుగున వెళ్లిపోయారు. ఒక్క అమ్మాయి మాత్రం ఉమ దగ్గరకొచ్చి "రావమ్మా నువ్వు కూడా మా బడికి" అన్నది.

ఉమ – "ఇది మీ బడా? నీ పేరేమిటి? అన్నది. "నా పేరు నీలతార" అన్నది ఆ పిల్ల.

ఉమ – "మీ బడికి నేను రావచ్చా?"

నీలతార – ఓ! తప్పకుండా, మా పంతులమ్మ చాలా మంచిది.

ఉమ నీలతారతో బడిలోకి పోయింది. వాళ్ళ పంతులమ్మ చక్కగా నవ్వుతూ, "నీల, ఆ పాప ఎవరు?" అన్నది.

నీల – మన బడివద్ద కనబడితే పిలుచుకొచ్చానమ్మా. ఈమె పేరు ఉమ.

పంతులమ్మ – ఉమా, నువ్వు కూడా చదువుకుంటావా?

ఉమ – చదువు తానండీ.

పంతులమ్మ ఒక లెక్క ఇచ్చింది. ఉమకు ఆ లెక్కరాలేదు. కళ్లవెంబడి నీళ్ళు వచ్చినై. పంతులమ్మ అది చూసి, అదేమని అడిగింది.

ఉమ – నాకీ లెక్క రాదండీ.

పంతులమ్మ – "అయ్యో లెక్క రాకపోతే ఏడుస్తారా? నన్నడగాలమ్మా నేను నీకు నేర్పుతాను" ఇలా రా! అంటూ పంతులమ్మ ఉమను ప్రేమగా చేరదీసి ఆ లెక్కను నేర్పింది. నేర్పి "ఉమా నువ్వు చాలా మంచి దానవు. లెక్క రాకపోయినా ఎవరి దగ్గర నుండీ చూసి కాపీ కొట్టలేదు. కాని తొందరపడిపోకుండా బాగా ఆలోచిస్తే తెలియని విషయాలు కూడా తెలుస్తాయమ్మా" అన్నది.

ఉమ – మీరు చాలా మంచివారండీ.

మళ్లీ ఉమకు గాలిపటం కనిపించింది. ఇంతసేపు ఎక్కడికి పోయిందో గాలిపటం అని ఉమ అనుకుంటూ ఉండగానే ఒక పల్లెటూరు కనిపించింది. కొద్దిక్షణాల్లో ఆ ఊరు దగ్గరకు వచ్చేసింది. అక్కడ కూడా చాలా మంది ఆడపిల్లలు కనిపించారు. ఉమకి ఒక్క నిమిషంలో వాళ్లంతా ఉమచుట్టూచేరి "నీ పేరేమిటి పాపా?" అని అడిగారు. "నా పేరు ఉమ" అన్నది. ఆ పిల్లలు తమతమ పేర్లను చెప్పారు. పాప, లత, రమ, లక్ష్మి, సీత ఇంకా ఎన్నెన్నో అన్నీ రెండక్షరాల పేర్లే – ఆ పిల్లలంతా చాలా మంచివాళ్ళు, ఎంతో కలిసిమెలిసి ఆడుకుంటున్నారు. ఒకళ్ల ఆటవస్తువులు మరొకళ్లకిచ్చుకుంటున్నారు. కూడా తెచ్చుకున్న తినుబండారాలు ఒకళ్లవి ఇంకొకళ్లకు పెట్టుకుంటున్నారు.

ఉమకు కూడా చాలా వస్తువులూ తినుబండారాలూ ఇచ్చారు. ఉమ వాళ్లను "ఇది ఏ ఊరు" అన్నది. వాళ్లు "ఇది పిల్లల రాజ్యం మేమంతా మా ఊరు అంటాం దీన్ని" అన్నారు.

ఉమ – "పిల్లల రాజ్యమా" అన్నది ఆశ్చర్యంగా

లక్ష్మి – లీలా ఉమకు పిల్లల రాజ్యం అంటే ఏమిటో చెప్పవే.

లీల – ఉమా పిల్లల రాజ్యంలో పిల్లలంతా పెద్దవారికి మల్లేనే అన్ని పనులూ చేసుకుంటాం. పెద్దవారి మాట శ్రద్ధగా వింటాం వారు చెప్పకుండానే మా చదువు మంచి చెడ్డలను మేమే చూచుకుంటాం. మేమెక్కడికి వెళ్లినా మమ్మల్ని చాలా గౌరవంగా చూసి ముద్దుగా ప్రేమగా "వీళ్లు మంచి పిల్లలు" అని అందరూ అంటారు. మాకు తిట్లూ, చీవాట్లూ ఎప్పుడూ తగలవు.

ఉమ – నిజంగానా? అబ్బ నేను కూడా మీలాగే ఉంటాను.

ఇంతలోకి మళ్లీ గాలిపటం కనిపించింది. దాన్ని చూస్తూ "అయ్యో ఇంతసేపటినుండి ఇల్లు వదలి తిరుగుతున్నాను. అమ్మా నాన్నా నాకోసం వెతుక్కుంటారో ఏమో" అనుకుంది. ఇంతలో తన ఇల్లు కనిపించింది. గట్టిగా "అమ్మా, అమ్మా" అని అరచింది. లోపలినుండి ఉమ తల్లి "అదేమిటే పొద్దున ఏడుగంటలైనా లేవకుండా కలవరింతలొకటి?" అంటూ వచ్చింది.

ఉమ సిగ్గుపడిపోయింది. "అయ్యో నేనింకా నిద్రపోతున్నానా?" అని ఆశ్చర్యపడి "పరవాలేదులే ఇక ముందు నేను మంచి పిల్లనై పోతానుగా" అని గంతులేసి పళ్లు తోముకోడానికి వెళ్లింది.

ఉమ తల్లి నవ్వుకుంటూ "ఓయబ్బో! ఎంత మంచి దానవవుతావో చూస్తాగా" అన్నది.

ఉమ అన్నట్లుగానే చాలా మంచి పిల్ల అయింది. బళ్లో బడితోట శ్రద్ధగా పెంచింది. చదువులో నిదానంగా ఆలోచించి అన్ని పాఠాలూ వల్లెవేసింది. బడిలో పిల్లల ప్రభుత్వానికి బడిపెద్ద అయింది.

# రవి

రవి మనస్సు అదో మాదిరిగా ఉంది ఆ రోజు. ఉదయం బడికి పోయిన వెంటనే ఇద్దరు తోటిపిల్లలను కొట్టి వారి వద్దనున్న నేరేడు పండ్లను లాక్కుని తిన్నాడు. వారు ఏడుస్తూ వెళ్లి క్లాసు టీచరుకి చెప్పారు. క్లాసు టీచరు చేత చీవాట్లు తినడం దైనందిన కార్యక్రమంలో ఒక భాగమే రవికి. అతనిది ఐదో క్లాసు. ఆ క్లాసు టీచరు సుగుణమణి చెప్పగలిగినంతగా చెప్పేది అల్లరి మానమని. తుదకు ఆ రోజు రవి అల్లరిని గూర్చి ప్రధానోపాధ్యాయురాలు వద్దకు వెళ్లి విన్నవించింది. ప్రధానోపాధ్యాయురాలు రవి కోసం క్లాసుకు కబురు పంపింది. సుగుణమణితో ప్రధానోపాధ్యాయురాలి వద్దకు పోతున్నానని చెప్పి తిన్నగా బడి వదిలి ఇల్లు చేరుకున్నాడు రవి.




ఉదయం పదకొండు గంటలకే ఇల్లు చేరిన రవిని తల్లి అడిగింది కారణమేమని - అసలు కారణం చెప్పకుండా ఒంట్లో బాగులేదని తల్లితో అబద్ధమాడాడు. తల్లి ఒళ్ళు పట్టిచూసి, ఒంట్లో ఎందుకు బాగులేదని అడిగింది. కళ్లలో నీళ్లు తిరిగి తలనొప్పిగా ఉన్నదని అన్నాడు. తల్లి జాలిగా చూసి 'రవీ, మనస్సు బాగా లేదా నాయనా? బళ్లో అల్లరిగాని ఏమైనా చేశావా?' అని అడిగింది. రవి మాట్లాడకుండా కళ్లు మూసుకుని పడుకున్నాడు. తల్లి వంట ఇంటిలోకి పని ఉండి వెళ్లింది. రవి, తల్లి అవతలకు పోవడం చూసి మనస్సులో బాధ పోయేదాకా వెక్కివెక్కి ఏడ్చాడు.

సాయంకాలం తండ్రి ఇంటికి వచ్చాడు. వస్తూనే "రవీ నీకొక మంచి ఇంగ్లీషు బొమ్మల పుస్తకం కొనుక్కొచ్చానురా. అది చదవటం నేర్చుకుంటే ఇంగ్లీషులో మాట్లాడటం కూడా వస్తుంది" అన్నారు.

రవి ఇంకా పడుకునే ఉండటం చూసి, "ఒంట్లోగాని బాగాలేదా నాయనా?" అంటూ రవి మంచం దగ్గరకు వచ్చి "ఏడిచావెందుకు?" అని ఆదుర్దాతో అడిగారు. దాంతో రవి పైకి ఏడ్చేశాడు. తల్లి లోపలి నుండి వచ్చి ఆ రోజు రవి ఉదయం పదకొండింటికే వచ్చాడనీ, వచ్చినప్పటినుండీ తలనొప్పిగా ఉందని అలాగే పడుకొని ఉన్నాడనీ చెప్పింది.

తండ్రి గ్రహించాడు. రవి బళ్ళో ఏదో చేసి ఉంటాడని. ఆ విషయం ఏమీ కదపకుండా ఆ పూటకు ఊరుకున్నాడాయన. రాత్రి భోజనానికి రమ్మని తల్లీ తండ్రీ పిలిచి తినిపించారు.

మర్నాడు ఉదయం నిద్రలేచిన రవికి ఒకటే దిగులు. బడికి వెడితే క్లాసుటీచరు అడుగుతుంది. అబద్ధం ఆడి ఇంటికి వెళ్ళిపోయావెందుకని. బడికి వెళ్ళకపోతే అమ్మానాన్న బడికెందుకు వెళ్ళవని అడుగుతారు. ఆలోచించి కాసేపటికి తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా నేను బడికి ఇవ్వాళ కూడా పోనే, రేపు వెళ్తాను" అన్నాడు. "పోనీలే బాబూ రేపే వెళ్ళు" అని తల్లి మళ్ళీ రవి దగ్గరగా వచ్చి "నాయనా బళ్ళో అల్లరిచేస్తే నిజం చెప్పు అంతేగాని బడిమాని అబద్ధాలాడవద్దు. నాన్నగారు చూడు ఎంత మంచివారో నిన్ను ఎప్పుడూ కొట్టలేదు, తిట్టలేదు. మనపక్కింటి చంద్ర తండ్రిని చూస్తున్నావుగా, రోజూ చంద్రాన్ని కొడుతూ ఉంటారు. ఇవాళ్టికి మాత్రం ఆడుకుని రేపటి నుండీ బడికి తప్పకుండా పోవాలి బాబూ" అని బుజ్జగించింది. రవి తన క్లాసు పుస్తకాలు ముందు కేసుకుని శ్రద్ధగా చదువుతూ కూర్చున్నాడు. రవి తండ్రి మామూలు ప్రకారం పది గంటలకల్లా భోజనం చేసి ఆఫీసు బట్టలు వేసుకుని బయటికి వెళ్లారు. రోజూ ఆఫీసు నుండి సాయంకాలం ఆరుగంటలదాకా ఇంటికి రానేరారు. కాని ఆ రోజున పదకొండింటికల్లా ఇంటికి వచ్చారు. రవితో ఏమీ మాట్లాడలేదు. రవి తల్లిని పిలిచి అదుర్దాగానూ, రహస్యంగానూ పది నిమిషాలు మాట్లాడి మళ్ళీ వెళ్ళిపోయారు.

మర్నాటి ఉదయం రవికి తల్లి తొమ్మిదింటి కల్లా భోజనం పెట్టింది. రవి తండ్రి కూడా త్వరగా భోజనం చేసి ఆఫీసు బట్టలు వేసుకుని తనతో కూడా వెంటబెట్టుకుని రవిని బడివద్దవదలి వెళ్ళిపోయారు.

బడిలో ప్రార్థన గంట కొట్టే లోపుగా రవి బిక్కముఖంతో ఒక చెట్టుకింద కూర్చుని క్లాసుటీచరుకు ఎటువంటి సమాధానం చెప్పాలో ఆలోచించుకుంటున్నాడు. అసలు అల్లరే చెయ్యకపోతే ఈ బాధ ఉండకపోనుగదా అని విచారిస్తున్నాడు. ప్రధానోపాధ్యాయురాలు దగ్గరనుండి ప్యూను వచ్చి రవి ఎదురుగా నిలిచి "పెద్దమ్మగారు నిన్ను పిలుస్తున్నారు బాబూ" అని పిలిచాడు. వాడిని చూడడం తోటే భయపడ్డ రవికి ఇంకా హెడ్‌మిస్ట్రెస్ పిలిచిందనడంతో కాళ్లల్లో వణుకు పుట్టింది. అయినా ప్యూనుతో ప్రధానోపాధ్యాయురాలి గదిలోకి వెళ్లాడు.

ప్రధానోపాధ్యాయురాలు సుశీలాదేవి రవిని ఒక్కసారి చిరునవ్వుతో పరికించి చూసింది. రవి కళ్లల్లో నీరు నిలిచి ఉంది. "రవీ, నాకు నమస్తే చెప్పావా ఇప్పుడు?" అన్నది. అప్పుడు నమస్కారం పెట్టలేదని గుర్తుకొచ్చి తల దించుకున్నాడు రవి. "చూడు రవీ, నువ్వు బళ్లో ఎక్కువగా అల్లరి చేస్తున్నావట. మీ టీచరు సుగుణమణి గారు మీకు ప్రేమతో పాఠాలు చెప్తారు. ఆమెను అందరు పిల్లలకంటె ఎక్కువగా నువ్వు విసిగించేశావట. బడికి రావడం అబద్ధాలాడి అల్లరి చెయ్యడానికా? లేక చదువునేర్చి బుద్ధిమంతుడవడానికా? చెప్పు" అని రవి వంక చూసింది సుశీలాదేవి. రవి తల ఎత్తి భయంగా ఆమె ముఖంలోకి చూశాడు.

"నాకు జవాబు చెప్పురవీ" అన్నదామె గంభీరంగా మళ్లీ.

"చదువుకుని బుద్ధి నేర్చుకోడానికే బడికి రావాలండీ" అన్నాడు నెమ్మదిగా.

ప్ర. ఉ. – అయితే నువ్వు మూర్తినీ వాళ్ల తమ్ముడు గోపీనీ కొట్టి వాళ్లు బడితోటలో కోసుకున్న నేరేడు పండ్లను తినేశావటగా? నిజమేనా?

రవి – అవునండి.

ప్ర. ఉ. – అట్లా చెయ్యడం తప్పుకాదూ?

రవి – వాళ్లిద్దరూ అంతకుముందు నేనొకసారి మంచి నేరేడు పళ్లుకోసుకుంటే లాక్కుని తినేసి వెక్కిరించారండి.

ప్ర. ఉ. – అందుకని నువ్వు తిరిగి వాళ్లను ఏడిపించావా?

(రవి మవునంగా అవునని తల ఊపాడు)

ప్ర. ఉ. – వారం రోజుల క్రితం సరళ అనే మీ తరగతి అమ్మాయిని జారుడు బండ మీద నుండి పడేశావటగా? అప్పుడు ఆ పిల్ల చెయ్యి విరిగిందటగా?

రవి – సరళ నేను బండ ఎక్కిన తరువాత వచ్చి, చప్పున నా మీద పడబోయిందండి. నేను పడిపోయానేమోనని ఆమెను తోశానండి. ఆమె చెయ్యి విరిగిందని తెలిసిందండి.

ప్ర. ఉ. – నెల రోజుల నాడు లక్ష్మి అనే అమ్మాయిని కొట్టి రెండణాల బిళ్లను ఆమె వద్దనుండి కాజేశావటగా?

రవి – లక్ష్మిని కొట్టి రెండణాల బిళ్ల లాక్కున్నానండి. కాని కాజేయలేదండి.

ప్ర. ఉ. – లాక్కోవడం అంటే కాజేయడం కాదా?

రవి – ఆ రెండణాల బిళ్ల మరొక చిన్నమ్మాయి దండి. లక్ష్మి ఆ చిన్నమ్మాయి దగ్గర నుండి లాక్కుంటే ఆ చిన్నపిల్ల ఏడ్చిందండి. అందుకని లక్ష్మిని కొట్టి ఆ చిన్నపిల్లకు ఆ రెండణాలబిళ్ల ఇచ్చేశానండి.

ప్ర. ఉ. – రవీ నువ్వు నిజం చెప్పావు సంతోషం కాని బళ్లో పిల్లలు ఏదైనా పొరపాటు చేస్తే నువ్వు కూడా పిల్లవాడివే కదా వారిని నువ్వు శిక్షించడం తప్పుకదూ?

రవి – మరేం చెయ్యాలండి?

ప్ర. ఉ. – మీ క్లాసు టీచరుకు చెప్పాలి. ఆమె వినకపోతే నాకు చెప్పాలి. ఆ విషయం మేమే చూసుకుంటాం. నిన్ను మూర్తి అతని తమ్ముడు గోపీ వెక్కిరించి నీ నేరేడు పళ్లు కాజేసినప్పుడు నువ్వు మీ టీచరు సుగుణమణి గారికి చెప్పావా?

రవి – లేదండి. నేను ఎవ్వరికీ చెప్పలేదండి. చెప్పినా కూడా నేనే అల్లరి పిల్లవాడినని అందరూ చూసినా చూడకపోయినా కూడా నా మీదే చాడీలు చెప్తారండి (ఏడుపు వచ్చినట్లు మాట్లాడాడు.)

ప్ర. ఉ. - (రవిని బుజ్జగించి జాలిగా) చూడు రవీ ఇతర పిల్లలు నిన్ను ఏడిపించి అల్లరి చేసినప్పుడు నువ్వు పెద్దవారికి చెప్పలేదు. వాళ్లను నీ ఇష్టప్రకారం కొట్టినప్పుడు వాళ్లు వచ్చి మాకు అంటే పెద్దవాళ్ళకు చెప్పారు. అందుకని నేనూ సుగుణమణిగారూ కూడా నువ్వే అల్లరివాడివని అనుకుంటున్నాం. ఇక ముందెప్పుడూ ఏం జరిగినా నువ్వు పిల్లలను కొట్టడం అదీ మానుకోవాలి.

రవి - వాళ్ళు నన్ను కొడితే నేనేం చెయ్యాలండి?

ప్ర. ఉ. - సుగుణమణిగారికి గాని నాకు గాని చెప్పాలి.

రవి - అలాగేనండి.

ప్ర. ఉ. - మరి అబద్ధాలు ఎందుకు ఆడుతున్నావు?

రవి - ఎప్పుడు ఆడానండి?

ప్ర. ఉ. - మొన్న మీక్లాసు టీచరుతో నా వద్దకు పోతున్నట్లు చెప్పి ఇంటికి వెళ్లిపోయావటగా?

రవి - అవునండి. మొన్న రామూ, గోపీ కలిసి నన్ను మీరు కొడతారని భయపెట్టారండి. అందుకని తప్పించుకు పారిపోయానండి.

ప్ర. ఉ. - తప్పుచెయ్యడం మానెయ్యాలి గాని తప్పించుకుపోవడం చెడ్డపిల్లల లక్షణం కాదూ? మరి ఇంట్లో అమ్మగారికి నాన్నగారికి ఒంట్లో బాగులేదనీ తల నొప్పిగా ఉందనీ చెప్పి నిన్న కూడా బడిమానేశావటగా?

రవి - (ఉలిక్కిపడ్డట్టు చూశాడు) ఇంట్లో అబద్ధం ఆడినట్లు మీకు ఎవరు చెప్పారండీ?

ప్ర. ఉ. - మీ నాన్నగారు నిన్నవచ్చి అన్ని విషయాలూ తెలుసుకుని వెళ్లారు. తల్లిదండ్రులతో అబద్ధం ఆడటం తప్పు బాబూ ఎప్పుడూ అటువంటి పని చెయ్యకు. నాన్నగారితో రేపు నన్ను కలవమని చెప్పు.

రవి - అలాగేనండి.

(ఇంతలో రవి నాన్నగారే అక్కడికి వచ్చారు.)

ప్ర. ఉ. - రండి కేశవరావుగారూ. మీ రవితోటే ఇంతసేపటి నుండీ మాట్లాడుతున్నాను. మీ పిల్లవాడు నేననుకున్నట్లు అల్లరివాడుకాడు. కాని అల్లరివాడని అనిపించుకున్నాడు. వేరే పిల్లలు పొరపాట్లు చేసినప్పుడు క్లాసుటీచరుకుగానీ నాకుగానీ తెలపకుండా తనే కలగజేసుకున్నాడు. దాని బట్టి అంతా అల్లరిపిల్లవాడని రవికి పేరు పెట్టారు. కొడితే తిరిగి కొట్టడం తప్పు పెద్దవారికి చెప్పాలని చెప్పాను ఇప్పుడే.

కేశవరావు - రవీ చూడు మీ ప్రధానోపాధ్యాయురాలు ఎంత మంచివారో. మొన్న బళ్లోనూ ఇంట్లోనూ కూడా అబద్ధమాడావటగా?

(రవికి దుఃఖం ఆగలేదు)

రవి - నాన్నా ఇంకెప్పుడూ అబద్ధాలాడను మొన్న నిజంగా భయంవేసి ఏడిస్తే తలనొప్పి వచ్చింది, నిజం చెప్పితే నన్ను అమ్మా నువ్వూ కూడా అల్లరివాడినని అంటారని చెప్పలేదు.

కేశవరావు - ఇవ్వాళ్టికి రవిని ఇంటికి పంపండీ. (బెల్లు నొక్కి, ప్యూన్ వస్తే సుగుణమణిగారి కోసం కబురు పంపింది.)

(రవిని తీసుకుని కేశవరావుగారు ఇంటికి వెళ్లారు - సుగుణమణి ప్రవేశించింది.)

ప్ర. ఉ. - మనం అనుకున్నట్టు రవి అల్లరిపిల్లవాడు కాదండీ మెత్తటి మనస్సే. ఎదటి పిల్లలకు న్యాయం జరిపించడానికో, తనకు జరిగిన అన్యాయాన్ని ఎదుర్కోడానికో ప్రయత్నించాడు. మనతో చెప్పకుండా తనే చర్య తీసుకున్నాడు. అట్లా చెయ్యటం తప్పు అని ఇప్పుడే నచ్చ చెప్పాను. ఆ పిల్లవాడి తండ్రి చాలా మంచివాడు. నిన్నా ఇవ్వాళా కూడా ఎంతో ఆదుర్దాగా వచ్చి వెళ్లారు.

సుగుణమణి - అదేనండీ, నేను ఎంత ప్రయత్నించినా ఇతని అల్లరికి కారణం తెలియలేదు. రోజూ ఏదో ఒక గొడవ తెచ్చిపెట్టేవాడు.

ప్ర. ఉ. - ఈ సంగతి మీకు చెప్పాలనే పిలిచాను.

సుగుణమణి - అయితే వస్తానండీ.

ప్ర. ఉ. - మంచిది.

ఆ మర్నాడు రవి బడికి వెళ్తూనే సుగుణమణిగారిని కలిసి ఇకముందు అల్లరి చెయ్యనని ఆమెకు చెప్పి క్షమించమని అడిగాడు. ఆ తరువాత ఎప్పుడూ రవి అల్లరి పిల్లవాడు అనిపించుకోలేదు.

# లత మీది లత

ఉదయం ఎనిమిది గంటలైనా ఇంకా లత మంచం పైన పడుకుని ఉన్నది. పాపం దాదాపు రెండు నెలల నుండి జ్వరంతో బాధపడుతోంది.

లతకు తోట అంటే ప్రాణం - చిక్కుడు విత్తులు నాటింది. అవి మొక్కలై లత పడుకున్న కిటికీలో నుండి చూస్తే కనుపించేటట్లు పందిరికి పాకినై. లత చాలాసేపు ఆలోచించింది. ఆ చిక్కుడు తీగను గురించి పందిరి వెయ్యకపోతే అది ఆకాశంలోకి ఎంత దూరం పాకుతుందో కదా అనుకుంది. కళ్ళు మూతలు పడుతున్నాయి.



కిటికీ దగ్గరకు నీరసంగా అడుగులో అడుగు వేస్తూ వెళ్ళింది లత, చిక్కుడు తీగను చూసేందుకు. ఆశ్చర్యపడేటట్లు ఆ చిక్కుడు తీగ ఆకాశంలోకి నిలువుగా పెరిగి ఉంది. మెల్లిగా కిటికీలోకి ఎక్కి ఆ చిక్కుడు తీగను పట్టుకుని నిలబడింది. "అరే, ఈ చిక్కుడు తీగ నిచ్చెనలాగ గట్టిగా ఉన్నదే" అనుకుని ఆశ్చర్యపోయింది. దానిపైకి ఎక్కుకుంటూ చాలా దూరం వెళ్లింది. ఆకాశాన్ని అందుకోవాలని కోరిక పుట్టింది. పైకి పోయినకొద్దీ మంచిగాలి, అన్ని రకాల పువ్వుల సువాసనలతో నిండుకున్నట్లు వీస్తోంది. లత ఆనందానికి అంతులేదు. ఇక ఇక్కడ ఉండిపోతే హాయిగా ఉంటుందనుకుంది. కాని ఈ లోగా దూరాన్నుండి పెద్దకేకలు వినిపించాయి. ఆ కేకలు వినిపించిన వైపుకు చూసింది. చూసీ చూడడంతో ఆమెకు ఎక్కడలేని భయమూ పుట్టుకొచ్చింది. కాస్త దూరంలో ఒక వందమంది రాక్షసులున్నారు. వాళ్ళు నల్లగా మొద్దుల్లాగా ఉన్నారు. నెత్తి మీద జుట్టు నిటారుగా నిలిచి ఉండి. వాళ్ళ కళ్ళు కోడిగుడ్లంత లేసి ఉన్నాయి. అవి చింతనిప్పుల్లాగా ఎర్రగా ఉన్నాయి. వాళ్ళ నోట్లో పళ్ళు మధ్యవి జానెడేసి పక్కలవి బారడేసి ఉండి కిందికి వేళ్ళాడుతున్నాయి. వాళ్ళలో వాళ్ళు ఎందుకో తగవులాడుకుంటూ కేకలేస్తున్నారు. కేకలు వేసినప్పుడల్లా వాళ్ళనోళ్ళలో నుండి భగ, భగమని మంటలూ పొగలూ వస్తున్నాయి.

లతకు ముందు భయం వేసినా ఈ రాక్షసుల్ని చూసేసరికి కొంత విచిత్రమనిపించింది కూడా. వాళ్ళమాట ఒక్కటి కూడా అర్థంకావడం లేదు. వాళ్ళేమి మాట్లాడుకుంటున్నారో తెలుసుకోవాలని ప్రయత్నం చేసింది. కాని లాభం లేకపోయింది. వాళ్ళ కేకల్ని కాసేపు విని, తనుకూడా వాళ్ళలాగానే కేకలు వెయ్యాలని ప్రయత్నం చేసింది. కొంతసేపటికి రాక్షసులతోపాటు తనుకూడా కేకలు వెయ్యడం మొదలుపెట్టింది.

లత కేకలు కొంతసేపటికి రాక్షసులకు వినిపించినాయి కాబోలు వాళ్ళు వాళ్ళ తగవులాట ఆపి లతవైపు చూశారు. చూడడంతోనే వాళ్ళముఖాల్లో సంతోషం కనుపించింది. లత కూర్చున్న దగ్గిరికి వచ్చారు. లత మీద చెయ్యివేశాడు ఒక పెద్ద రాక్షసుడు. లత కెవ్వున కేకపెట్టింది. అప్పుడక్కడ ఉన్న రాక్షసులంతా గొల్లున నవ్వారు.

ఆ రాక్షసులు ఇలా మాట్లాడుకోవడం మొదలు పెట్టారు.

ఒకడు : ఈగిరి పిగిరి ల్లగర శుగురు ద్ధగర పిగిరి రిగిరి కిగిరి దిగిరి.

రెండవవాడు : చిగిరి న్నగర పిగిరి ల్లగర కగర దగర మగర రిగిరి.

మూడవవాడు : చగర క్కగర నిగిరి పిగిరి ల్లగర కగర దుగురు?

మిగిలిన వాళ్ళు : అగర వుగురు నుగురు చాగర లగర చగర క్కగర నిగిరి పిగిరి ల్లగర ముగురు ద్దొగొరొ స్తుగురు న్నగర దిగిరి.

ఈ భాష వింతగా ఉన్నది లతకు. తనను గూర్చే మాట్లాడుతున్నారని తెలుస్తోంది. కాని ఆ భాష ఏమిటో అని శ్రద్ధగా వింటూ కూర్చుంది.

ఇంతలో ఒక చిన్న రాక్షసుడిని ముందుకు తోసి మిగిలిన వాళ్ళు ఇలా అన్నారు. "నుగురు వుగురు వెగిరి ళ్ళిగిరి ఆగర పిగిరి ల్లగర తొగొరొ మాగర ట్లాగర దుగురు" చిన్న రాక్షసుడు లతతో "నువ్వు ఎవరు" అన్నాడు.

లత : నేను ఈ చిక్కుడు తీగ ఉండే ఊర్లో ఉంటాను. ఇది మా దొడ్లోదే.

రాక్షసుడు : అంత భయపడే పిల్లవి ఇంత దూరం ఎందుకు వచ్చావు?

లత : ముందు మిమ్మల్ని చూస్తే భయం వేసింది. మీ నోళ్ళల్లో నుండి మంటలూ పొగలు ఎందుకొస్తాయి?

రాక్షసుడు : మేముతినే వస్తువుల్ని నోట్లోనే వండుకోవడానికీ కాల్చుకోవడానికీని. మా దేశంలో నిప్పు చేసుకోం.

లత : మీ నోళ్ళల్లో అంతంత పొడుగాటి పళ్ళు ఉన్నాయి కదా. వాటితోటి ఎట్లా బతుకుతారు? మీ వంటికే గుచ్చుకోవూ?

రాక్షసుడు : మాకు కూరలు మాంసమూ కోసుకోవడానికి చాకులూ కత్తిపీటలు ఉండవు. మా పళ్లతోటే చీరి తినేస్తాం. మేము ఎప్పుడూ వెల్లకిలా పడుకుని నిద్రపోవాలి. అందుకని అవి మాకు గుచ్చుకోవు.

లత : మరి మీ గుడ్లు కోడి గుడ్లంత లేసి ఉన్నాయి కదా ఎర్రగా భయమేసేటట్లు వాటితో కూడా ఏదైనా పని చేస్తారా?

రాక్షసుడు : ఓ! మా కళ్ళకు ఎంత దూరంగా ఉన్న వస్తువైనా కనిపిస్తుంది. ఆ వస్తువు లోపల ఏముందో కూడా కనుపిస్తుంది.

లత : అయితే నా పొట్టలో ఏముందో చెప్పు చూద్దాం.

రాక్షసుడు : నీ పొట్టలో ఏమీ లేదు. అంతా ఖాళీ.

లత : అవును చాలా ఆకలిగా ఉంది. నేను మళ్లీ మా అమ్మదగ్గరకు పోవాలి.

రాక్షసుడు : మరి ఇక్కడికి ఎందుకొచ్చావు?

లత : ఊరికేనే – నేను తొందరగా వెళ్లాలి గాని మీ భాష నాకు నేర్పుతావా?

రాక్షసుడు : ఓస్, ఇంతేనా? మా వాళ్ళకు నీ భాష రాదు. నీకు మా వాళ్ళ భాష రాదు. మా భాషలోని గర, గిరి, గురు, గెరె, గొరొ మొదలైనవి తీసి పారేస్తే మీ భాష అవుతుంది.

లత : అంతేనా? నాకు వచ్చేస్తుంది మీ భాష. నాగర కుగురు మీగిరి భాగర షగర వగర చ్చేగెరె సింగిరి దిగిరి (అంటూ చప్పట్లు కొట్టింది సంతోషంతో)

మిగిలిన రాక్షసులంతా పరుగు పరుగున లత దగ్గరికి వచ్చి తమ భాషలో మాట్లాడడం మొదలు పెట్టారు. వాళ్ళు చూస్తే భయం వేసేటట్టున్నారు. కాని, చాలా మంచివాళ్ళు లాగున్నారు. వాళ్ళ దగ్గరే ఉండిపోవాలని ఉన్నా, మళ్ళీ అమ్మా నాన్నా బెంగ పెట్టుకుంటారేమోనని అనుకుంది. పువ్వుల వాసనలతో కూడిన చల్లని గాలిని తనివితీరా పీల్చి. రాక్షసులతో మా అమ్మనూ నాన్ననూ కూడా మీ దేశం తీసుకొస్తానని చెప్పి, "పోగొరొ తుగురు న్నాగర పోగొరొ తుగురు న్నాగర" అనుకుంటూ కళ్ళు తెరచి చూసేసరికి లత తల్లి ఎదురుగా ఉన్నది.

"ఏమ్మా లతా ఇందాక ఎనిమిది గంటలకు వచ్చి చూస్తే మేలుకుని ఉన్నావు. కాసిని పాలు తాగుతావేమోనని కాచి తెచ్చేసరికి మళ్ళీ పడుకుండిపోయావు. మళ్ళీ వంటింట్లో నుంచి వచ్చేసరికి 'గరగరా గరగరా' అంటూ ఏమో అరుస్తున్నావు. కలవచ్చిందా అమ్మా?

లత : అవునమ్మా కలవచ్చింది. కలలో కథకూడా వచ్చిందమ్మా. గమ్మత్తుగా ఉంది. నాకు జ్వరం ఉన్న సంగతే మరచిపోయానమ్మా.

తల్లి : ఏది చూడనియ్యి. జ్వరం జారింది. కడుపునిండా తిని ఎన్నాళ్ళయిందో నా తల్లి. కాసిని పాలుతాగు.

లత పాలు తాగేసి మళ్ళీ నిద్రపోయింది. ఈసారి కలలూ రాలేదు. రాక్షసులూ రాలేదు. కళ్ళు తెరచేసరికి వాళ్ళ డాక్టరుగారు ఎదురుగా ఉన్నారు. అమ్మతోటీ నాన్నతోటీ వారం రోజుల్లో అమ్మాయి బడికి పోవచ్చును. రెండు రోజులు పాలూ పళ్ళూ ఇచ్చి తరువాత భోజనం మెల్లిగా పెట్టవచ్చని చెప్తున్నారు.

జ్వరం తగ్గాక లత, తన స్నేహితులతో తన కలలో కథను చెప్పింది. అప్పటి నుండీ బళ్ళో పిల్లలకు "లత మీద లత కథ చెప్పులతా" అనో లేక "కలలోని కథను చెప్పులతా" అనో అడగడం అలవాటైంది.

# పని లేని రాజు

మాలతి ఆరేళ్ళ పిల్ల. కథలంటే చాలా ఇష్టం. వాళ్ళ అన్నయ్య మధు ఆమెకు కథలు చెప్పేవాడు. ఒకనాటి రాత్రి మాలతి అడిగిన వెంటనే ఒక కథ చెప్పాడు.

అనగా అనగా ఒకరాజు. ఆయనకు పిల్లా జెల్లా లేరు. పెళ్లీ గిల్లీ కూడా కాలేదు. పని గినీ కూడా లేదు. ఆయనకు బొమ్మలు వేయడం మహా ఇష్టం పొద్దున మొదలు సాయంత్రం దాకా ఏవో బొమ్మలు వేస్తూ ఉండేవాడు. వాటికి మంచి మంచి రంగులు కూడా వేసేవాడు. రంగులు వేసి, 'అబ్బా, ఈ బొమ్మలకు ప్రాణం వస్తే ఎంత బాగుండును' అని అనుకుంటూ ఉండేవాడు. కాని ప్రాణం పోయడం రాజుగారికి చేతకాని పని.



పెళ్లీ గిళ్లీ, పనీ పాటా లేని ఆ రాజుగారు తన ముఖ్యమంత్రిని పిలిచి తను గీచిన బొమ్మలన్నింటికీ ప్రాణం పోసే విధానమేమైనా ఉన్నదా అని అడిగి చూశాడు.

మంత్రిగారు చిరునవ్వు నవ్వి ప్రాణం పోసే శక్తి ఒక్క భగవంతునికే కదా ఉన్నది అన్నాడు. రాజుగారికి కోపం వచ్చింది. కాని ఏమి చెయ్యడానికీ తోచలేదు. చాలాసేపు ఆలోచించాడు. ఆలోచించగా ఆలోచించగా ఒక మార్గం కనిపించింది. అది ఏమంటే తపస్సు చేసి భగవంతుడి పరిచయం సంపాదించి ఈ ప్రాణం పోసే శక్తిని పొందాలని. కొన్నాళ్ళకు రాజుగారు తపస్సు చేయడం మొదలు పెట్టారు. రాజ్య వ్యవహారాలన్నీ మంత్రులకు వదిలేశారు. కాబట్టి వారే చూసుకుంటున్నారు. రాజుగారి తపస్సును ఎవ్వరూ ఆటంకపరచలేదు.

ఒకనాటి రాత్రి రాజుగారు తపస్సు విరమించి మంత్రులందర్నీ పిలిచి సమావేశపరచారు. తను వస్తువులకు ప్రాణం పోసే శక్తిని సంపాదించానని వారికి తెలిపారు. మంత్రులంతా ఆశ్చర్యపోయారు. ఇంతలో రాజుగారు అక్కడ ఉన్న ఒక పెద్ద బల్లమీద చెయ్యివేశారు. వెంటనే ఆ బల్ల జర్ర్, జర్ర్ర్ మంటూ ఒయ్యారంగా గది అంతటా తిరగటం మొదలెట్టింది. మంత్రులందరూ ఈ వింతను చూసి ఒకరి ముఖాలు ఒకళ్లు చూచుకున్నారు. ఆ బల్ల తమ వైపు వచ్చినప్పుడల్లా పరుగెత్తి పక్కకు తప్పుకుంటున్నారు. రాజుగారు గర్వంగా వారి వంక చూసి తన శక్తిని ఇంకా ప్రదర్శించాలని అక్కడ ఉన్న వస్తువులన్నింటిపైనా చెయ్యి వేశారు. తను గీచిన బొమ్మల మీద కూడా చెయి వేశారు. ఇంకేముంది అంతా గందరగోళంగా తయారయింది. గదిలో సామానంతా రణగొణ ధ్వని చేసుకుంటూ గదిలో తిరుగుతూ ఉంటే గీసిన బొమ్మల్లోని మనుష్యులు మాట్లాడటం ప్రారంభించారు. అక్కడ సమావేశమైన వారికి ఆశ్చర్యమూ వింత పోయి భయం పట్టుకుంది. వారికి ఆ తిరిగే బరువైన సామాన్లవల్ల గాయాలు తగిలినై. ఇటుపోతే కుర్చీలతో ఢీకొంటున్నారు. అటుపోతే బల్లలతో ఢీ కొంటున్నారు. పోనీకదా అని ఏమూలకో ఒదిగి నిలుచుంటే రాజుగారు గీసిన బొమ్మలు గట్టిగా గోలగా మాట్లాడుకుంటున్నై. ఆ మాటలు వినలేక చెవులు మూసుకుంటున్నారు.

కొంతసేపటికి మంత్రులందరూ పరుగు లెడుతూనే మొరపెట్టుకున్నారు. వస్తువులకు ప్రాణం వస్తే భరించడం కష్టమని. కాని పరిస్థితి విషమించింది. రాజుగారి మాటలైనా మంత్రులు వినగలిగే అవకాశం లేదు. వారందరికీ నడిచే సామానువల్ల విపరీతంగా గాయాలు తగిలి శోకాలు మొదలెట్టారు. దీనికి తోడు రాజుగారి భవనంలో ఏదో గందరగోళం అవుతోందని తెలుసుకుని ప్రజలంతా పరుగు పరుగున బయల్దేరి అక్కడికి చేరారు. ఆ విధంగా వెళ్ళిన వాళ్ళకు కూడా దెబ్బలూ గాయాలు తగిలి, ఆ రభసకు కారణం తెలియక విచిత్రంగా వాళ్ళతో వీళ్ళు కూడా కలిసిపోయారు.

రాజుగారికి కాస్త జ్ఞానోదయం కలిగింది. ఆ గోల కంతకూ తనే కారణమని తెలుసుకున్నారు. అంతేకాదు, భగవంతుణ్ణి శాయశక్తులా ప్రార్థించి, ఆ వస్తువుల ప్రాణాలను తీసివేయమని దీనంగా కోరాడు.

ఒక బొంగురు గొంతుకతో భగవంతుడు రాజుగారికి జవాబిచ్చాడు. ఇచ్చిన ప్రాణం తిరిగి పుచ్చుకోవడం తనకు చేతకాదని భగవంతుడు మాటలాడినప్పుడు మాత్రం ప్రాణంతో ఉన్న వస్తువులు మనుష్యులూ కూడా నిశ్శబ్దంగా ఉన్నారు. మంత్రులూ ప్రజలూ కూడా భగవంతుడిని ప్రార్థించి తమను ఆ కష్టం నుండి తొలగించమని కోరారు. భగవంతుడి ఎదుట రాజుగారు తను చేసింది పొరపాటనీ, అటువంటి పొరపాటును ఇక మీదట ఎన్నడూ చేయననీ, అతి దీనంగా వేడుకున్నాడు. అప్పుడు భగవంతుడు దయదలచి రాజుగారిని క్షమించి ఆ వస్తువుల ప్రాణాలను తిరిగి తీసుకున్నాడు. అందరూ భగవంతునికి మొక్కారు.

మంత్రులూ ప్రజలూ సంతోషంతో రాజుగారికి కూడా మొక్కారు. వినయంగా రాజుగారితో భగవంతుడి కొక్కడికీ ఉండేశక్తి మనకుగావాలని కోరుకొనడం పొరపాటని విన్నవించుకున్నారు. రాజుగార అది నిజమేనని ఒప్పుకుని, అటువంటి కోరికలను ఇక మీదట కోరనని మాట ఇచ్చి, ప్రజలను ప్రేమతో పరిపాలించడం మొదలెట్టారు.

కథ కంచికీ, మనం నిద్రకూ, ఏం చెల్లాయ్, అన్నాడు మధు.

మాలతికి కథ బాగుంది కాబోలు "మళ్ళీ చెప్పవా అన్నాయ్?" అన్నది.

"నేను రాసి, అచ్చువేయిస్తాను. అప్పుడు నీ కిష్టమొచ్చినన్నిసార్లు చదువుకో దానిని" అన్నాడు మధు. ఇంతలోకే నిద్రపోయింది మాలతి.

# గొప్పలు

విమల బడినుండి వస్తూనే "అమ్మా, మాక్లాసులో ఒక కొత్తమ్మాయి చేరింది. పేరు కమల. చాలా బాగుంది మంచి పిల్లలాగా ఉంది" అన్నది.

"అయితే ఆ అమ్మాయిని రేపు మనింటికొకసారి రమ్మనరాదూ?" అంది విమల తల్లి శ్యామల.

"ఏమోనమ్మా మంచి పిల్లలాగానే ఉందిగాని గొప్పలు చెప్పుకుంటుందమ్మా. అప్పుడే పిలవడమెందుకులే. కొన్నాళ్లయ్యాక చూద్దాం" అంది విమల.



శ్యామల నవ్వి "మహా నువ్వు మాత్రం తక్కువా? వీలదొరికితే గొప్పలు చెప్పుకోవూ" అంతి తల్లి.

"నీకు తెలీదులే అన్నీ ఆపిల్ల చెప్పినట్టే ఎలా చెప్పుకోగలనూ? కొంత నే చెప్పేది కూడా ఆ పిల్ల వినాలి" అంది విమల.

బళ్లో కమలా విమలా మాట్లాడుకుంటుంటే మిగిలిన పిల్లలు తెగ నవ్వుకునేవారు. "మా నాయనమ్మ ముసలావాడ. అయినా నాకు బోలెకు కథలు చెప్పి చిన్నపిల్లలాగా మాతో సరదాగా ఉంటుంది అని కమల అంటే, "మా నాయనమ్మ కూడా ముసలావిడే" అనేది గాని ఆవిడను గూర్చి గొప్పగా చెప్పేందుకు ఏమీ దొరికేది కాదు విమలకి.

కమల తన నీలం కంచి పట్టు పరికిణీ గురించి గొప్పగా చెప్పుకుంటే విమల వాళ్లమ్మను తనకొక నీలం కంచి పట్టు పరికిణీ కుట్టించమని అడిగింది.

"నీలం రంగు ఎందుకే ఇంకా చాలా మంచి రంగులున్నై బూడిదరంగు పరికిణీ కుట్టించుకో చాలా బాగుంటుంది" అంది తల్లి శ్యామల.

'కాదమ్మా కమల నీలం రంగే బాగుంటుందంది' అన్నది.

"ఆ అమ్మాయికి ఏది బాగుంటే అదేనీకుకావాలా? ఉత్త పిచ్చిపిల్లవే నువ్వు" అంది తల్లి.

ఒక రోజున విమల బడినుండి వస్తూనే అమ్మా, మన శేఖరం మామయ్య ఇంగ్లండులో చదువుకున్నాడా? అని అడిగింది.

"లేదే, శేఖరం మామ ఊరికే ఇంగ్లండు చూసి వచ్చాడు. చదువుకోలేదక్కడ" అంది తల్లి.

"మరి మన పెద్ద మామయ్య ఇంగ్లండులో చదువుకున్నాడా?" అని మళ్లీ అడిగిందా పిల్ల.

"లేదు. ఎందుకూ ఈ ప్రశ్నలన్నీ?" అని అడిగింది తల్లి.

"ఎందుకో చెప్తాగానీ మన అత్తయ్యలు టెన్నీసు ఆడగలరా?" అని మళ్లీ మరో ప్రశ్నవేసింది.

"విమలా, ఎందుకీ ప్రశ్నలు? మన అత్తయ్య లెవ్వరూ టెన్నీసు ఆడడం నేర్చుకోలేదు. చదరంగం, పులిజూదం ఆడతారంతే" అని ఆవిడ అసలు సంగతేమిటో ఊహించేసుకుంది.

"ఎంచక్కా కమలా వాళ్ళ మామలు ఇంగ్లండులో చదివారు, వాళ్ళ అత్తలంతా టెన్నీసు ఆడతారు. మన మామలో, ఒక్కళ్లూ ఇంగ్లండులో చదవలేదు. ఒక్క అత్తకూ టెన్నీసు ఆడడం రాదు... అని గుణిసింది విమల. అసలు సంగతి తల్లి ఊహించినట్లే అయింది.

"శేఖరం మామ ఇంగ్లండులో చదవలేదు గానీ, అమెరికా వెళ్ళిమూడేళ్లు అక్కడ ఉద్యోగం చేసి వచ్చాడే. అయినా విమలా, నువ్వు కమల చేసినట్టన్నీ చెయ్యగలవుగాని, నీ మామలూ అత్తలూ కమల మామలూ అత్తలూ చేసినట్టు ఎలా చెయ్యగలరే?" అని నవ్వింది శ్యామల.

మర్నాడు బడిలో, తన శేఖరం మామ అమెరికాలో ఉద్యోగం చేశాడనీ, తన అత్తలు చదరంగం, పులిజూదం ఆడగలరనీ గొప్పలు చెప్పుకుంది విమల. కమల నవ్వి, "పులిజూదం ఆడడం గొప్పకాదోయ్" అంది. విమల కాసేపు మూతి బిగించుకుని కూర్చుంది.

ఒకరోజు విమల వచ్చేసరికి తల్లి ఒక ఉత్తరం చదువుతోంది. కూతురు వంక తిరిగి చూసి ముసిముసిగా నవ్వింది.

"ఎవరు రాశారమ్మా ఆ ఉత్తరం? నవ్వుతున్నా వెందుకమ్మా?" అంటూ తల్లిని గారంగా అడిగింది విమల.

"మన శేఖరం మామకు పెళ్ళిటే. ఒక అందమైన చదువుకున్న అత్త వస్తోంది నీకు. ఆమె పేరు లీల. ఆమెకు తొమ్మిది భాషల్లో మాట్లాడటం వచ్చుట తెలుసా?" అని తల్లి చెపుతుంటే విమల సంతోషానికి అంతులేదు. బడికి వెళ్లి ఈ గొప్పవిషయాలు కమలకు ఎప్పుడు చెప్పడమా అని తొందరపడింది.

మర్నాడు బళ్లో కమలకు చెప్పేసింది. విమల తన లీలత్తని గురించి "ఓస్ ఇంతేనా? నాకూ ఉంది ఒక లీలత్త. ఆమె పది భాషల్లో మాట్లాడగలదు. ఆమె మీ అత్తకంటే కూడా చాలా

అందమైంది. ఎన్నో పరీక్షలు ఫస్టుగా పాసైంది. ఒక బంగారు పతకం కూడా వచ్చింది తెలుసా, మా లీలత్తకు?" అన్నది కమల కళ్ళు తిప్పుతూ.

విమల మళ్ళీ ఏం సంగతులు దొరుకుతాయా, కమలను ఎలా ఓడించాలా, అని ఆలోచిస్తూనే ఉంది. ఈలోగా మాలీలత్త అందమైందంటే, మా లీలత్తే అందమైందనీ, మా లీలత్త గొప్పదంటే, మా లీలత్తా గొప్పదనీ ఆ పిల్లలిద్దరూ వాదించుకుంటూనే ఉన్నారు.

శేఖరం మామ పెళ్ళికి విమలా వాళ్ళూ వెళ్లలేదు. వాళ్ల నాన్నగారికి సెలవుదొరకక.

కొన్నాళ్ల తరువాత విమల బడి నుండి ఇంటికి వచ్చేసరికి తల్లి చేతిలో ఒక ఉత్తరం ఉంది.

"విమలా, నీ కోసమే ఎదురు చూస్తున్నానే, లీలత్త రేపు వస్తుంది. శేఖరం మామ ఉత్తరం రాశాడు. అత్తకూడా రాసింది. నువ్వు చాలా అందంగా ఉంటావని శేఖరం మామ చెప్పాడుట. నీకొక అందమైన పట్టుపరికిణి దానిమీదికి మంచి జాకెట్టూ కొని తెస్తోందిట" అన్నది శ్యామల.

ఆ మర్నాడు ఆదివారం. లీలత్త ఎప్పుడు వస్తుందా అని ఆత్రంగా ఎదురు చూస్తోంది విమల. ఆ రోజు బాగా తొందరగా నిద్రలేచి తలంటుకుని అమ్మనడిగి కుట్టించుకున్న నీలం కంచి పట్టు పరికిణి కట్టుకుంది. ఎంతో అందంగా తయారైంది. పదకొండు గంటల వేళ ఇంటి ముందు కారాగిన చప్పుడై, ఎవరెవరో వచ్చిన అలికిడైంది. వెంటనే మేడ మీద నుండి పరుగు పరుగున దిగింది విమల.

అరే! ఎంతో ఆశ్చర్యం! శేఖర్ మామతో లీలత్త వచ్చింది, ఆవిడ చెయ్యి పట్టుకుని ఎగురుకుంటూ కమల కూడా వచ్చింది. అత్తచాలా అందంగా ఉంది! అనుకుంటూ మేడ మెట్ల మీదే నిలబడిపోయిన కూతుర్నిచూసి, శ్యామల "రావే, లీలత్త కోసం అంత కలవరించి, తీరా వస్తే అక్కడే నిలబడి పోయావేం?" అంది.

అప్పుడే కమలకూడా మెట్లవైపు చూసి ఆశ్చర్యపోతూ, "మా లీలత్త!" అన్నది.

లీలత్త చిరునవ్వుతో అందంగా మెరిసిపోతూ, "మీ ఇద్దరికీ లీలత్తనే" అంటూ విమల వైపు నడిచింది. విమల ఆఖరి మెట్లు రెండూ దిగి అత్త అందించిన కుడి చెయ్యిపట్టుకుంది. సంతోషంగా కమలా విమలా ఒకరి ముఖం ఒకరు చూసుకుని అత్తచేతులు పట్టుకుని సంతోషంగా నవ్వుకున్నారు.

ఆ మర్నాడు అత్తతెచ్చిన గులాబీ రంగు కొత్త పరికిణీలు రెండూ కట్టుకుని ఇద్దరూ చాలా స్నేహంగా బడికెళ్ళారు.

# అసూయ

ఇంజనిరుగారబ్బాయి తన కొత్తసైకిలు బడిలో క్లాసు బయట తాళం వేసి వదలి క్లాసు కెళ్లాడు. అతను వెళ్లిన అరగంటకు మాస్టారబ్బాయి తన పాత సైకిల్ని తోసుకుంటూ ఒక విసురున క్లాసు బయట వదిలేసి తన వాచీ చూసుకుని లోపలికి పరుగుతీశాడు.

పాతసైకిలు కొత్తసైకిలు వైపు చూసింది. కొత్త సైకిలు, భలేమెరిసిపోతూ అందంగా కనిపించింది. ఇందాకా ఇంజనీరుగారబ్బాయి దాన్ని నడుపుతుంటే తనను దాటేసి చకచకా ఎలా వెళ్లిందో గుర్తు తెచ్చుకొని పాతసైకిలు అసూయతో కుళ్లి ఏడ్చింది.

కొత్తసైకిలు "ఏం ఏడుస్తున్నావా? మీ మాస్టారబ్బాయి నిన్ను విసిరేసినప్పుడు నీకు దెబ్బలేమైనా తగిలాయా?" అని అడిగింది.



అసలే అసూయతో కుళ్లుతున్న పాత సైకిలుకి ఒళ్లు మండిపోయింది. "తన గొప్పదనం వెల్లడి చేసుకోవాలని నాతో మాట్లాడుతోందిది. నేనసలు దీంతో మాట్లాడనే మాట్లాడను." అనుకుని కళ్లు తుడుచుకుని నీరసంగా పడుకుంది.

కొత్తసైకిలు మళ్లీ పలకరించింది. "ఏం, మీ యజమాని నిన్ను తిట్టాడని మనసు కష్టపెట్టుకున్నావా? అయినా నీ తప్పేముంది? ఇన్నాళ్లనుండి వాళ్ళకు నువ్వు చాకిరి చేస్తుంటే కాస్త టైరు మార్పించి రంగు వేయించి నిన్ను జాగ్రత్తగా వాడాలని వాళ్ళకు తెలియొద్దూ?"

"అవన్నీ చేస్తే నువ్వు బడికి త్వరగానే వచ్చేదానివిగా?" అని ఓదార్పుగా అంది కొత్తసైకిలు.

ఈ ఓదార్పు మాటలతో పాతసైకిలుకి దుఃఖం కట్టలు తెంచుకుని వచ్చింది.

"నువ్వు చెప్పినట్లు నన్ను వాళ్లు ఎప్పుడూ జాగ్రత్తగా వాడరు. ఇంట్లో పిల్లలందరూ నన్ను రోజంతా తిప్పి ఇష్టమొచ్చినట్లు వాడేసి నా రంగంతా పోగొట్టి డొక్కులాగా చేశారు. నా వయస్సు ఇంకా ఐదేళ్లయినా లేదు. అప్పుడే ముసరితనం వచ్చేసింది. ఇందాక బయటికి తెస్తూ మా యజమాని నన్ను నానా మాటలూ అన్నాడు. నేను పాతడొక్కునట. రోజూ బడికి ఆలస్యంగా తీసుకువెళ్తానట. దారి పొడుగునా నన్ను ఎత్తిపడేస్తూ తీసుకొచ్చాడు. నీకేం, అదృష్టవంతురాలివి. మెరుపులాగా నడుస్తావు. నిన్ను, మాయకుండా మీ యజమాని అపురూపంగా చూసుకుంటాడు. నిన్నెప్పుడూ తిట్టడు" అని తన అసూయను పైకే కక్కేసింది పాత సైకిలు.

నువ్వు మాత్రం నడవలేవా మెరుపులాగా, నా వయస్సు రెండేళ్ళే అయినా ఐదేళ్ళనాటి నీ మెషీను చాలా మంచిది. అందుకని నాకంటే నువ్వేబాగా నడవగలవు. నీకు కొత్తటైర్లు వేసి నూనెరాసి రంగు పూయిస్తే నాకన్న నువ్వే అందంగా తయారై నాకన్నా త్వరగా పోగలవు తెలుసా?" అన్నది కొత్తసైకిలు.

చిన్నవాళ్లెప్పుడూ అమాయకంగానే ఉంటారు. పాతసైకిలు వయస్సులో పెద్దదైనా మొదట తనకన్నా మూడేళ్ళు చిన్నదైన కొత్త సైకిల్ని చూసి అసూయ పడిపోయింది. తరువాత కొత్తసైకిలు మనసు మంచిదని గ్రహించింది.

'అనవసరంగా అసూయ పడ్డాను' అనుకుంది. కొత్త సైకిలుతో కాస్త మాట్లాడి మనసు తేలిక పరచుకోవాలనుకుని "చూడు నువ్వు చెప్పినట్టు నాకు టైర్లు మార్పించి రంగులు వేయిస్తే బాగుండును కాని మా యజమానికి నేనంటే శ్రద్ధలేదు. నేనేం చేసేది?" అని అడిగింది, ఏడుపు ఆపుకుంటూ.

"మీ యజమానికి మా యజమాని చెప్తాడులే, నువ్వేడవకు" అని సముదాయించింది కొత్తసైకిలు.

ఇంజనీరుగారబ్బాయి క్లాసు బయటికొచ్చి "శ్రీనూ ఇవ్వాళ బడికి అరగంట ఆలస్యంగా వచ్చావెందుకూ?" అని మాస్టారబ్బాయిని అడిగాడు తన కొత్తసైకిలు తాళం తీస్తూ.

“ఏం చెప్పేదిరా రవీ, నీకు మంచి సైకిలుంది. నా వెధవ సైకిలు పాతడొక్కైంది. మా నాన్న కొత్తది కొనమంటే, “మళ్లీ ఏడాది కొంటాలే” అంటారు. దారి పొడుగునా దీంతో తిప్పలే నాకు. రోజూ విరిచి ముక్కలు చెయ్యాలని అనిపిస్తుంది నాకు” అన్నాడు శ్రీను కోపంతో.

ఈ మాటలు విని పాతసైకిలు భయంతో ఒణికిపోయింది. కొత్తసైకిలు దానికి సంజ్ఞ చేసి ఓదార్చింది.

“అదేమిటి శ్రీను అంత మంచి సైకిల్ని వాడుకోవడం చేతకాక, పైగా దాన్ని తిడుతున్నావా? నాలుగొందలు పెట్టి కొత్తసైకిలెందుకురా? దీనికో పాతికో ముప్పయ్యో రూపాయలు ఖర్చుచేసి టైర్లు మార్పించి అయిలింగు చేయించి రంగు వేయించు నా సైకిలుకన్నా కూడా నీదే బాగుంటుంది” అన్నాడు రవి.

శ్రీనుకి రవి మాటలు నచ్చినై. అతను పాత సైకిలుని జాగ్రత్తగా తీసుకెళ్ళి కొంచెం డబ్బు ఖర్చుపెట్టి సరి చేయించాడు.

ఒక రోజున శ్రీనూ, రవీ పక్క పక్కగా సైకిళ్లు తొక్కుతూ సంతోషంగా బడికి వెళ్తున్నారు.

కొత్తసైకిలు పాతసైకిలుతోటంది, “నువ్వు ఆస్పత్రి నుంచెప్పుడొచ్చావు? నిన్ను చూసి నేను గుర్తే పట్టలేదు! ఎంత అందంగా ఉన్నావిప్పుడు! మహా వేగంగా నడిచేస్తున్నావే!” అని పలకరించింది.

“అవును నువ్వు చాలా మంచి దానివి. నన్ను నువ్వు ప్రేమగా పలకరించి నేనేడ్చినప్పుడు నన్ను ఓదార్చావు. నేను చాలా చెడ్డదాన్ని ముందు నిన్ను చూసి అసూయ పడ్డాను. ఇప్పుడు నువ్వెంత మంచిదానివో నాకు తెలిసి వచ్చింది. మీ యజమాని మా యజమానికి నచ్చచెప్పాక నన్ను ఆస్పత్రిలో చేర్చి, పాడైన భాగాలను తీయించి కొత్తవి వేయించి, రంగులు పూయించాడు. ఇప్పుడు నేను చాలా ఆరోగ్యంగా ఉన్నాను. అంతా నీ చలవే” అన్నది కొత్త రూపంలో మెరిసిపోతున్న పాతసైకిలు.

అప్పటి నుండీ పాతసైకిలు ఎవ్వర్నీ చూసి అసూయపడరాదని గుణపాఠం నేర్చుకుంది.

# అటకమీది దయ్యం

అమ్మ అత్తా వాళ్లింటికెళ్లింది. రాధకేమి తోచడం లేదు. అత్తా వాళ్లింట్లో పిల్లల్లేరు. అందుకని రాధ అమ్మతో పోలేదు. ఏమి చెయ్యాలా అని ఆలోచిస్తూ ఉండగా రమవచ్చింది. రమ రాధా స్నేహితురాళ్లు. ఇద్దరి వయస్సూ ఎనిమిదేళ్లు.

రాధా, రమ ఏమి ఆడుకుందామా అని ఆలోచిస్తూ ఉండగానే వాన ప్రారంభమైంది. కాసేపట్లో అది పెద్దవానైంది. ఇక ఈ పిల్లలు బయట తోటలో ఆడుకునే అవకాశం లేకపోయింది.



"రమా, ఒకసారి నువ్వు మా అటక ఎక్కుదామన్నావు కదూ?" అంది రాధ.

"మీ అమ్మ కోప్పడుతుందన్నావు కదూ?" అంది రమ.

"ఇప్పుడు మా అమ్మ ఇంట్లో లేదులే. ఎక్కి చూద్దామా? నేను కూడా చూడలేదెప్పుడూ" అంది రాధ.

"అంత పైకి ఎక్కాలంటే చిన్న స్టూలుగానీ కుర్చీగాని చాలదే రాధా. ఒక నిచ్చెన ఉండాలి" అంది రమ.

"ఓ, దానికేం సామాను గదిలో ఒక చిన్న నిచ్చెన ఉంది. దాన్ని నేనే మొయ్యగలను. వంటవాడు నిద్రపోతున్నాడు. వాడు లేచేలోగా మనం అటక ఎక్కి దిగి మళ్లీ నిచ్చెనని ఆ గదిలో పడేద్దాం" అని రాధ నిచ్చెన తెచ్చింది.

రమ నిచ్చెన ఎక్కి సగం దూరం పోయి "ఒసేయ్ రాధా కింద గట్టిగా పట్టుకోవే, నాకు భయమేస్తోంది." అంది.

"ఫరవాలేదులే ఎక్కవే నేను కూడా ఎక్కి వస్తాను నీ వెనకే" అని రాధ అంటే రమ పైదాకా ఎక్కేసి "నువ్వు కూడా రావే. ఇక్కడ వెల్తురు సరీగ్గాలేదు" అంది.

రాధ కూడా పైకెక్కింది. "బాబోయ్, ఇక్కడ అంతా బూజూ సాలె పురుగులూ సాలెగూళ్లూ నేవ్. అంతా దుమ్ము దుమ్ముగా ఉంది" అంటూ గౌను మూతికడ్డం పెట్టుకుంది.

అక్కడ ఒక పాత ట్రంకు పెట్టెమీద ఇద్దరూ కూర్చున్నారు. ఉన్నట్టుండి రమ రాధను వాటేసుకుని నోట మాట లేకుండా వేలుతో ఒకమూలకు చూపింది. రాధ కూడా రమను గట్టిగా కౌగిలించుకుని భయంతో ఆయాసపడుతూ దయ్యం! అని నీరసంగా నూతిలో నుండి మాట్లాడుతున్నట్టంది.

అక్కడ రమ చూపించిన చోట నల్లని గుడ్లు మెరుస్తున్నై. అవి మెల్లిగా దగ్గిరకొచ్చిన్నై. ఈ లోగా ఆ పిల్లలిద్దరూ ముచ్చెమటలుపోసి ఒణికిపోతున్నారు. భయంతో కళ్ళు మూసుకున్న వాళ్ళిద్దరూ "మ్యావ్" అనే అరుపుతో ధైర్యం పుంజుకుని కళ్ళు తెరిచారు. వాళ్ళ ఎదురుగుండా ఒక నల్లపిల్లి ఉంది. అది వచ్చిన మూల నుండి ఇంకా చిన్న చిన్న అరుపులు వినిపించినై. అవి పిల్లికూనలవని వాళ్ళు తేలికగా గ్రహించారు. ఆ నల్లపిల్లి తన కూనల్ని వీళ్ళు పట్టుకెళ్తారని కాబోలు భయపడి వీళ్లమీదికి "గుర్, ఘుర్...." మంటూ వచ్చింది.

"రావే రమ, మనం దిగి వెళ్లిపోదాం. ఆ పిల్లి మననేం చెయ్యదుగానీ భయపడకు" అని ధైర్యం చెప్పి నిచ్చెన కోసం చూస్తే అది అక్కడ లేదు.

రాధ గాభరాగా, "రమా నిచ్చెన ఏమైందే?" అని అంటూ ఉండగా, కిందినుంచీ "నిచ్చెన దయ్యమెత్తుకెళ్ళిందే" అని కీచు గొంతుకతో ఎవరో అన్నారు. అటుచూస్తే రాధ అన్న పన్నెండేళ్ళ రవి. వాడు అల్లరివాడు. రాధా, రమ పైకి ఎక్కినప్పుడు స్నేహితుడింటి నుండి ఇంటికొచ్చాడు. వీళ్ళని కనిపెట్టి చూస్తున్నాడు. రాధ భయంతో పిల్లిని చూసి "దయ్యం" అని అనడం విన్నాడు. వీళ్లని మరికాస్త ఏడిపించాలని నిచ్చెన అటక దగ్గిర నుండి తీసేసి ఒక మూలకు పెట్టాడు. కాసేపు ఏడిపించి నిచ్చెన అందించి రాధా, రమ దిగడానికి సహాయపడ్డాడు.

అప్పుడే వచ్చిన రాధ తల్లి రవిని కోప్పడింది. వాళ్ళని అనవసరంగా ఏడ్పించవద్దని. "అమ్మా నువ్వు ఒద్దంటావని నువ్వు లేకుండా చూసి ధైర్యంగా నిచ్చెనవేసి అటక ఎక్కి పిల్లిని చూసి భయపడ్డారు. వాళ్లకు బుద్ధి చెప్పాలని నిచ్చెన తీసేశాను. నన్ను కోప్పడతావెందుకమ్మా!" అన్నాడు రవి.

"బుద్ధి చెప్పడానికీ కోప్పడడానికీ నేనున్నాను గదుట్రా? అసలే భయపడ్డవాళ్ళని నువ్వు ఇంకా భయపెట్టరాదు" అని రవిని కేకలేసి "రాధా నువ్వు ఎక్కింది కాక రమను కూడా ఎక్కించావు కదా. భయంతో కిందపడితే కాళ్లో చేతులో విరిగిపోవూ? అదీకాక పాతసామానున్న ఆ అటక ఏ పురుగూ పుట్రా అన్నా ఉండి కరిస్తే ఏమయ్యేది? రమ వాళ్ళ అమ్మగారు నువ్వు అల్లరి పిల్లవని అనరూ?" అని సన్నగా రాధను చీవాట్లు పెట్టారు వాళ్ళమ్మ.

"అవునమ్మా నాకు తెలియక ఎక్కాను. ఇంకెప్పుడూ నీకు చెప్పకుండా చెయ్యనమ్మా" అంది రాధ తప్పు తెలుసుకున్నట్టు.

"పిన్నిగారూ అసలు ఆ అటక ఎక్కుదామని నేనే చాలాసార్లు రాధతోటన్నానండీ నానించే ఈ గొడవంతా అయ్యింది" అంది రమ నేరస్తురాలిలాగా.

మీకు అంత చూడాలని ఉంటే నేను చూపించేదాన్ని పైకెక్కించి జాగ్రత్తగా. మీరు మంచి పిల్లలు అల్లరి చెయ్యరు. "ఇక మీదట ఏదైనా చూడాలనిపిస్తే ముందుగా నాతో చెప్పాలి. సరేనా?" అని వాళ్లిద్దర్నీ బుజ్జగించారు రాధ తల్లి.

రాధా రమ భయం నుంచి తేరుకుని అటకమీద అంటిన దుమ్మూ ధూళీ పోయేటట్టు కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కొచ్చారు.

రమ వర్షం తగ్గాక ఇంటికిపోతూ "రాధా మీ అమ్మ భలే మంచిదే" అన్నది.

"అమ్మలందరూ మంచి వాళ్లేనే, మన కొక్కొక్కప్పుడు తెలియదు, అంతే" అన్నది రాధ మహా అనుభవజ్ఞురాలైనట్టు.

# మాట విలువ

రవి ఎనిమిదేళ్ళ పిల్లవాడు. అతని తండ్రి రమణరావు. రమణరావుగారు వ్యవసాయ శాఖలో చిన్న ఉద్యోగం చేస్తున్నారు. వాళ్లిల్లు చాలా చిన్నది. అద్దెలు ఎక్కువ పెట్టలేక జీతం పొదుపు చేసుకుని మూడొందల గజాల భూమి కొనుక్కున్నారు. దాని మీద చక్కని పాక వేయించారు. ఆయన భార్య జ్యోతి, ఆ పాకను ఎంతో అందంగానూ పరిశుభ్రంగానూ ఉంచుతుంది.

ఆ పాకను పాక అనలేం. అది ఒక అందమైన పెంకుటింటిలా ఉంటుంది. ఆ ఇంటిచుట్టూ రకరకాల పూలమొక్కలున్నై. ఈ పూలతోట ఆ ఇంటికి ఎంతో అందాన్నిచ్చింది. ఆ చక్కని ఇంట్లో తల్లిదండ్రులతో ఉంటాడు చిన్ని రవి.

ఒకరోజున రమణరావుగారు ఉదయమే బటికిపోతూ "రవీ అమ్మను జాగ్రత్తగా చూడు, ఏదైనా పని చెప్తే చేసి సహాయపడు. నేను రెండు రోజులదాకా ఎగ్జిబిషనులో పని చెయ్యాలి కాబట్టి ఇంటికి రాలేను అని చెప్పారు.

"సరే నాన్నా నేను అమ్మను జాగ్రత్తగా చూసుకుంటాను" అని రవి మాటిచ్చాడు.

ఆ రోజు శుక్రవారం. తండ్రి వెళ్లిన తరువాత తల్లి వంట చేస్తుంటే అన్నిట్లో సహాయపడ్డాడు. ఇల్లు సర్దుతుంటే సామాన్లన్నీ అక్కడి నుండిక్కడికీ ఇక్కడ నుండక్కడికీ

అందించాడు. వాడిని చూస్తే చాలా ముచ్చటనిపించింది జ్యోతికి. అందుకని "రవీ రేపు సాయంకాలం నిన్ను ఈ ఊరి పెద్ద తోటకు తీసుకెళ్తాను. నువ్వు చాలా బుద్ధిమంతుడివి. ఆ తోట నీ కిష్టం కదా అని అక్కడికి తీసుకెళ్తాను" అన్నది తల్లి.



రవి సంతోషానికి పట్టపగ్గాలులేవు.

శనివారం నాడు ఉదయం భోజనాలైనాక సాయంత్రం తోటలో సరదాగా తినడానికి పిండివంటలు చేసింది జ్యోతి. రవి కాగితపు సంచులలో వాటిని జాగ్రత్తగా పొట్లాలు కట్టి బుట్టలో సర్దిపెట్టాడు. ఇద్దరూ మూడు గంటలకల్లా పెద్ద తోటకు బయల్దేరారు. బస్సులో పోవాలని అటునడిచారు. అప్పుడే ఆకాశంలో మేఘాలు కమ్ముకున్నై. వర్షం వస్తుందేమో పోనీ మానేద్దామా పోవడం అని మనస్సులోనే అనుకుని మళ్లీ చిన్న రవి సంతోషాన్ని పాడుచెయ్యడం ఇష్టం లేక బస్సులో వాడిని ఎక్కించి తను ఎక్కింది.

తోటలో తిరిగి చాలాసేపు ఆడుకున్నాడు రవి. అక్కడ రకరకాల ఆకులుంటే మాలీల నడిగి తన హెర్బేరియంలో కని బుట్టలో జాగ్రత్తగా వేసుకున్నాడు. అప్పుడే తల్లి పిలిచి "రవీ ఐదున్నరైంది ఫలహారం, టీ తీసుకుందామా?" అన్నది.

రవి పరుగు పరుగున చేతులు కడుక్కుని వచ్చాడు. వాడికి బాగా ఆకలిగా కూడా ఉంది. వాడు తింటూ ఉండగా సన్నని చినుకులు ప్రారంభమైనై. తినడం అయినాక జ్యోతి చెయ్యి కడుక్కోవడానికని ఒక నీళ్ల కుండీ దగ్గిర కెళ్లింది. ఈలోగా చినుకులెక్కువైనై. తొందరలో వస్తూ కాలుజారి పడిపోయిందావిడ.

రవి "అమ్మా" అని కేకవేసి తల్లి దగ్గిర కెళ్లాడు. తల్లి కళ్లు మూసుకుని పడి ఉంది. రవి ఆవిడ ముఖమ్మీద తన చిన్న చెయ్యివేసి "పడ్డావా అమ్మా? నేను లేవతియ్యనా?" అని ప్రేమగా అడిగాడు.

జ్యోతి మెల్లిగా కళ్లు తెరిచి బిక్కముఖం వేసుకున్న కొడుకును చూసి, ఎలాగైనా లేవాలని ప్రయత్నించింది "అబ్బా" అని మళ్లీ పడుకుంది.

"రవీ, నేను లేవలేను బాబూ, కాలు బాగా బెణికింది. నువ్వు వెళ్లి త్వరగా మన డాక్టరు ప్రసాదరావుగారిని పిలుచుకొస్తావా? వాళ్లిల్లు ఈ తోటపక్క సందులోనేగా?" అన్నది.

రవి "సరే ఇప్పుడే వెళ్తాను" అని బయల్దేరాడు. వాన బాగా ఎక్కువైంది. తోట పెద్దగేటు దాటి డాక్టరుగారింటికి పోవాలి. విపరీతమైన వానతోపాటు తోట బయటికెళ్లేసరికి చీకటి కూడా పడింది. ఆ పక్కసందులో మరీచీకటిగా ఉంది. అందాకా వెళ్లాక వాడికి భయమేసింది. వెనక్కి పోవాలనుకున్నాడు. కాని తల్లి బాధతో వానలో పడుకుని ఉన్న సంగతి గుర్తుకొచ్చి, ధైర్యంతో ముందుకు నడిచాడు.

ప్రసాదరావుగారింటి ముందు లైటువేసి ఉంది. ఆయన భార్య కిటికీలోనుండి గేటు తెరచుకుని వస్తున్న రవిని చూసి "ఏవండీ మన రమణరావుగారబ్బాయి ఒక్కడూ ఈ వానలో వస్తున్నాడెందుకో" అని డాక్టరు గారికి ఒక కేకవేసి చెప్పింది.

డాక్టరు ప్రసాదరావు గారు గొడుగు వేసుకుని పరుగున వెళ్లి రవిని లోపలికి తీసుకొచ్చారు. రవి తల్లి పడిపోవడాన్ని గురించి చెప్పాడు.

"నువ్వు లోపలికి పోబాబూ పక్కతోటలోనేగా నేను వెళ్లి చూస్తాను అని వాళ్ల ఆసుపత్రి పనిమనిషి నరసమ్మను తీసుకుని తోటవైపు వెళ్లారు.

డాక్టరు గారి భార్య రవి తల తుడిచి వాడి బట్టలు మార్చి వాళ్లబ్బాయి బట్టలు తొడిగింది. వేడివేడి పాలు పట్టింది. కాసేపట్లో నరసమ్మ తన భుజం మీద ఆసరా ఇచ్చి జ్యోతిని నడిపించుకుంటూ వచ్చింది. ఆ వేళకే డాక్టరుగారు కూడా వచ్చేశారు. రవి బుట్టలో దాచుకున్న రకరకాల ఆకులు కూడా జాగ్రత్తగా తెచ్చారు. ఆ రాత్రికి వాళ్ళు డాక్టరుగారింట్లోనే ఉన్నారు. రవి డాక్టరుగారి అబ్బాయి మధుకి కూడా తను తెచ్చుకున్న ఆకుల్లోంచి కొన్ని ఇచ్చాడు.

ప్రసాదరావుగారు రమణరావు గారికి ఎగ్జిబిషను వద్దకు కబురు పంపి జరిగిన విషయం తెలిపారు.

మర్నాటి ఉదయం పదిగంటల కల్లా రమణ రావుగారు డాక్టరుగారింటికి వచ్చారు. డాక్టరుగారికీ ఆయన భార్యకూ వాళ్ళు చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలిపారు. వారంతా ఒక ఊరివారే. కాబట్టి ఎప్పుడూ ఒకళ్ళ కొకళ్ళు సహాయంగా ఉంటూ ఉంటారు.

"మీ రవి అంత చీకట్లోనూ వానలోను వస్తే, మా ఆవిడ ఆశ్చర్యపోయిందనుకోండి, రమణరావుగారు" అన్నారు డాక్టరుగారు.

"తీరా వాడిని పంపేశాక, డాక్టరు గారొచ్చిందాకా నాకు కూడా ఆదుర్దా అనిపించిందండీ ఆ వానలోనూ చీకట్లోనూ ఏమైపోయాడోనని" అంది జ్యోతి.

తండ్రి తన వంక చిరునవ్వుతో చూస్తే, "అమ్మని జాగ్రత్తగా చూడమన్నావు కదు నాన్నా?" అన్నాడు రవి.

# దొంగల కథ

కేశవరావు గారికి హైదరాబాదులో ఉద్యోగం. వారి స్వస్థలం ఒక పల్లెటూరు. ప్రతి సంవత్సరం ఎండాకాలంలో కుటుంబాన్ని తీసుకుని ఆ పల్లెటూళ్ళో రెండు నెలలు గడిపి వస్తారాయన, సెలవు పెట్టుకుని వెళ్ళి వస్తూ ఉంటాడు.

ఆ సంవత్సరం పిల్లలందరికీ పరీక్షలై సెలవు లిచ్చేవేళకు కేశవరావుగారి భార్య సావిత్రమ్మగారు - అక్కగారికి సుస్తీ చేసిందని అకస్మాత్తుగా కబురొస్తే - ఉన్నపళంగా వెళ్ళిపోయారు. కేశవరావుగారికి ఆఫీసు ఇన్‌స్పెక్షనుండడం వలన, ఆయ కూడా ప్రయాణం కాలేకపోయారు.

పిల్లలంతా నిరుత్సాహ పడతారని కేశవరావుగారు తమ ఇంట్లో వంట చేసిపెడుతున్న వాళ్ళ దూరపు బంధువు సీతమ్మగారితో పిల్లల్ని కార్లో వారి స్వంత ఊరు పంపే ఏర్పాటు చేశారు.

ఆ రోజు ఉదయమే త్వరగా లేచిన రవి తన పెద్ద చెల్లి రమను త్వరగా ప్రయాణానికి సిద్ధపడమని హెచ్చరించాడు. రవి కేశవరావు గారి పెద్ద పిల్లవాడు.

"అబ్బ ఈ సంవత్సరం సెలవులు అంత సంతోషంగా గడపలేమేమోరా అన్నయ్యా. అమ్మ ఊరెళ్ళింది. ఇక నాన్నగారు కూడా రాకపోతే ఏమీ సరదాగా ఉండదురా" అంది రమ.

"ఈ హైదరాబాదులో ఉండి మాత్రం ఏం చేస్తాం? ఎండాకాలంలో మనకు మనతోటలో బోలెడు తాటి ముంజలూ, కొబ్బరి నీళ్లూ ఉంటాయి. మన మామిడి తోటలో హాయిగా

కూర్చుని బాగా చదువుకుంటా నేను. నాన్నగారు ఎలాగో వారం రోజుల తరువాత వస్తారు. అమ్మ దగ్గర్నించి ఉత్తరం రాలేదింకా.ఎప్పుడొస్తుందోమరి" అన్నాడు రవి.




అప్పుడే నిద్రలేచిన పద్మ "అక్కా మన తోటలో మామిడికాయలు కావలసినన్ని తినొచ్చు" అంది అప్పుడే నోరూరుతున్నట్లు.

"నాన్నగారు మన పాలేరు వెంకన్నకూ మాలీ ముత్తయ్యకూ ఉత్తరాలు రాయించారు. మనం వెళ్లేసరికి వేరుశనగకాయలు ఇంట్లో రెడీగా ఉంటై. మామిడి తోటలో ఊగేందుకు ఉయ్యాల సిద్ధంగా ఉంటుంది" అంది మేలుకుని ఉండే నిద్ర నటించిన శశి, ఒక గంతులో పక్కమీంచి లేచి. శశి ఆఖరు పిల్ల. రెండోపిల్లవాడు రఘు ఈ కబుర్లన్నీ వింటూ ఇంకా పడుకునే ఉన్నాడు. రఘు శశికన్న పైవాడు.

ఈ లోగా సీతమ్మగారు పడకగదిలో కొచ్చి, "పిల్లలూ మనం పదింటికల్లా బయల్దేరాలి. మరి ఏడుకావస్తున్నా ఇంకా మంచాల మీద పడుకుంటే ఎట్లా?" అన్నది.

పిల్లలంతా లేచేశారు. త్వరత్వరగా కాలకృత్యాలు తీర్చుకుని, తమతమ బట్టలూ పుస్తకాలూ సర్దేసుకున్నారు. ఫలహారాలు కానిచ్చి భోజనాలను టిఫిను కారియర్లలోకి సర్దుకుని కారెక్కారు.

"సీతమ్మగారూ, పిల్లలు జాగ్రత్త. మన ఇంటి తాళాలు ఆ ఊర్లో రాజమల్లయ్యగారి వద్ద ఉంటాయి. ఏమైనా కావాలంటే మీరు ఆయన వద్దకు రవిని పంపండి. వారం రోజుల్లో నేనూ వచ్చేస్తాలెండి" అని కేశవరావుగారు కారు కదలబోయే ముందు హెచ్చరిక చేశారు.

ప్రయాణం సరదాగానే గడిచింది. ఒంటిగంటకల్లా వాళ్ళ ఊళ్లో కారాగింది. రాజమల్లయ్యగారి వద్దనుండి తాళాలు తీసుకుని తోటలోని తమ ఇంటి గుమ్మం ఎక్కారు సీతమ్మగారూ పిల్లలూ. అప్పుడే ఇంటి లోపల్నుండి నీరు పారపోస్తున్న చప్పుడైంది.

రమ, "సీతమ్మగారూ, లోపల ఎవరో ఉన్నట్టు అలికిడి అవుతోంది" అన్నది.

"తాళాలు మన వద్దనే ఉన్నై తల్లీ, లోపలికి ఎవరు వెళతారు?" అని నవ్విందావిడ.

చెంబు ఠంగుమని కింద పడేసిన చప్పుడైంది ఇంటిలోపల. మళ్లీ బక్కెట్టు ఈడ్చినట్టు కూడా వినిపించింది. ఈసారి సీతమ్మగారు నవ్వలేదు. పిల్లలంతా ఆమెచుట్టూ చేరి, మాటాపలుకూ లేకుండా కాసేపు నిలబడ్డారు.

"సీతమ్మగారూ, లోపల ఎవరో దొంగలు ప్రవేశించి నట్టున్నారండీ మొన్న మా స్నేహితురాలు వాళ్ల అమ్మా నాన్నలతో ఏలూరు వెళ్లి వచ్చేసరికి తాళమేసి ఉన్న ఇంట్లో దొంగలుపడి ఇల్లంతా దోచుకుని వెళ్ళారట. రెండు రోజులు ఆ ఇంట్లోనే వంట చేసుకు తిని ఇరుగు పొరుగు వారికి వారి చుట్టాలమని చెప్పారట" అన్నది రమ వీలైనంత తగ్గు స్వరంతో.

ఈ మాటలతో పద్నాలుగేళ్ల రవి కూడా భయపడ్డాడు. మిగిలిన పిల్లలంతా రవికన్న చిన్నవాళ్లే. వాళ్లంతా కూడా భయం భయంగా చూశారు.

"సీతమ్మగారూ, లోపల ఎంతమంది దొంగలున్నారో యేమో! రవి అన్నయ్యా, మీరు తప్ప మేమంతా చిన్నవాళ్లం. వాళ్లు పది మంది ఉంటే ఏం చెయ్యగలం?" అని రహస్యం చెప్పేధోరణిలో అంది పద్మ.

సీతమ్మగారికి అంతా అయోమయంగా ఉంది. ఆమెకు కూడా భయంవేసింది. కారుడ్రైవరు రాజయ్య కారుకు తాళం వేసి, దూరాన చెట్టుకింద కూర్చున్న మాలీని పిలవడానికి వెళ్లాడు. ఇక ఏదో ఆపద వచ్చిపడిందని అందరూ గజగజలాడారు. సీతమ్మగారు నాలుగు మూలలా కలయచూశారు. వెయ్యి మామిడిచెట్లున్న అంత పెద్దతోటలోనూ ఆ ఒక్క ఇల్లే ఉంది. తాళం చేతులు తన చేతుల్లోనే ఉండగా లోపలికి ఎవరెలా ప్రవేశించారో ఆమెకు అర్థంకాలేదు.

ఈ లోగా ఇద్దరు మగవాళ్లెవరో మాట్లాడినట్లయింది. వెంటనే అటకమీది నుండి ఏవో సామాన్లు దించినచప్పుడైంది కూడా.

"ఇంక అనుమానం లేదు. ఎవరో దూరారు లోపలికి. ఇప్పుడేం చెయ్యాలి మనం? రవీ, నువ్వు వెంటనే వెళ్లి మన రాజమల్లయ్యగారిని తక్షణం పిలుచుకురా. వీలైతే ఇంకా

ఎవరినైనా ఇద్దర్ని కూడా తీసుకురమ్మను" అన్నది సీతమ్మగారు చాలా ఖంగారుగా తగ్గుస్వరంలో. రవిని పంపేసి మిగిలిన నలుగురు పిల్లల్నీ వెంటేసుకుని కారు దగ్గరకెళ్లి నుంచుంది.

పది నిముషాల్లో రవీ, రాజమల్లయ్యగారూ, వారి పాలేర్లు ఇద్దరూ రెండు గట్టి కర్రలతోనూ వచ్చేశారు.

రాజమల్లయ్యగారు ఆ ఇంటి సింహద్వారం వద్ద నిలబడి తాళం తెరిచారు. ఈ లోగా సీతమ్మగారూ, పిల్లలూ కూడా అక్కడికి చేరారు. తలుపు తెరిచాక చుట్టల వాసన వచ్చింది. కాని లోపలి నుండి బయటికి ఎవ్వరూ రాలేదు. రాజమల్లయ్యగారు పాలేళ్లను కర్రలతో లోపలికి పొమ్మని సంజ్ఞచేశారు. వాళ్ళు లోపలికెళ్లేసరికి ఒక ఆడగొంతు "ఎవరూ?" అంది. రాజమల్లయ్యగారూ పాలేళ్లూ తెల్లబోయి నిలబడ్డారు. ఆ మాట్లాడినావిడ బయటికి వచ్చింది.

"అమ్మా, నువ్విక్కడికెల్లా వచ్చావమ్మా?" అంటూ పిల్లలంతా ఆవిడను వాటేసుకున్నారు. ఆవిడ సావిత్రమ్మగారే.

"నేను ఉదయం పదింటికి వచ్చానర్రా. ఈ ఇంటి వెనక వాకిలి తాళం చెవులు నాదగ్గిరే ఉన్నై. అందుకని రాజమల్లయ్యగారికి తరువాత కబురు పెట్టవచ్చని దొడ్డిదారిన ప్రవేశించాం. దొడ్డమ్మకి ఉన్న ఊరు మార్చి మంచి గాలీ వెలుతురూ ఉన్న ప్రశాంత వాతావరణానికి తీసుకెళ్లమని డాక్టరు చెప్పారు. నాతో దొడ్డమ్మా, అమ్మమ్మా, తాతయ్య కూడా వచ్చారు. అక్కడి నుండి ఇద్దరు పనివాళ్లను కూడా తీసుకొచ్చాం. పొద్దుటి నుండీ సామాను సర్దించాను. అమ్మమ్మ ఇప్పుడే స్నానం చేసి వంట మొదలుపెట్టింది. మీకు ఉత్తరం రాయాలంటే టైములేకపోయింది" అన్నది సావిత్రమ్మ.

"లోపల దొంగలు జొరపడ్డారని రవి చెప్పాడమ్మా అందుకే కర్రలతో సహావచ్చాం. అయినా కేశవరావుగారు మాకు కొత్తకాదు కదా, జబ్బు మనిషితో సహావచ్చారు. నాకు మాట మాత్రం చెప్పి పంపక పోయారా? ఇంకా నయం మీ పనివాళ్ళు మీకన్నా ముందు మాకు కనిపిస్తే వాళ్లకు దేహశుద్ధి అయ్యేది వాళ్ల అదృష్టం బాగుంది. అక్కగారికి ఈ ఊళ్లో వైద్యం ఎలాగమ్మా?" అన్నారు రాజమల్లయ్యగారు.

"ఆమెకు వైద్యం ఏమీ అవసరం లేదుటండీ, కేవలం విశ్రాంతీ మంచి ఆహారంతోటి కోలుకోవాలిట. అందుకే ఇక్కడికి తీసుకొచ్చాం. మీకు కబురంపలేదని మరోలా అనుకోవద్దు. మీ పిల్లలూ భార్యా క్షేమమేనా?" అన్నారు సావిత్రమ్మగారు.

ఆమె మాట్లాడుతూ ఉండగానే పిల్లలంతా "దొడ్డమ్మా" "అమ్మమ్మా" "తాతయ్యా" అనుకుంటూ లోపలికి జొరబడి ఆ దొంగల కథను వాళ్లకు చెప్పి కడుపుబ్బా నవ్వుకున్నారు.

సాయంకాలం అయిదు గంటలకల్లా "పిల్లలూ ఇంకో దొంగను చూడండి. తొందరగా రావాలి. అన్న తాతయ్య కేక విని అందరూ వీధి గదివైపు వెళ్లారు.

నిజంగా ఆశ్చర్యమే! వారం రోజుల తరువాత గాని రానన్న కేశవరావుగారు వచ్చేశారు.

"నాన్నా వారం దాకా రానన్నావే? ఇప్పుడే అమ్మతో చెప్పాను. ఎలా వచ్చేశావు?" అంది రమ సంతోషంగా.

"ఇన్‌స్పెక్షన్ వాయిదా వేశారు. నా సెలవు మంజూరు చేశారని మీకారు కదిలిన పదినిముషాలకే చప్రాసీ కాగితం తెచ్చి ఇచ్చాడు. ఇంకేముందీ తొందర తొందరగా తయారై బస్సులో వచ్చేశా" అన్నారు కేశవరావుగారు.

పిల్లల కోరిక ప్రకారం, అమ్మానాన్నా కూడా వచ్చేశారు. అంతా కలిసి సరదాగా మామిడి తోటలోనూ కొబ్బరి తోటలోనూ తిరిగి రావాలని బయల్దేరారు.

"సీతమ్మగారు వంట చేస్తుందిగా అక్క దగ్గిర నేనూ నాన్నగారూ కూర్చుంటాం. నువ్వుకూడా వాళ్ళతో కాస్త తిరిగిరావే సావిత్రీ. పిల్లలు నీకోసం వాచిపోయినట్లున్నారు" అంది కేశవరావుగారి అత్తగారు.

# ఎరువు నగ

శాంతా, సుమిత్రా ప్రాణ స్నేహితులు. సుమిత్ర భాగ్యవంతుల పిల్ల. శాంత సామాన్య కుటుంబీకుల పిల్ల. ఇద్దరూ ఒకే బళ్లో చదువుతున్నారు, ఒకే క్లాసు కూడా.

ఒక రోజున బళ్లో నాటకాలు వేశారు. వార్షికోత్సవం సందర్భంలో సుమిత్ర తన రవ్వల దుద్దులను శాంతకు పెట్టి శాంత చెవులకున్న చిన్న నక్షత్రాలను తను పెట్టుకుంది. ఇళ్లకు వెళ్లబోతూన్నప్పుడు "సుమిత్రా నీ రవ్వల దుద్దులు తీసుకోవే" అని శాంత అంటే "రేపు ఇద్దుగాని లేవే అసలే పొద్దు పోతోంది" అని సుమిత్ర హడావిడిగా వెళ్లిపోయింది.

శాంత ఇంటికి వచ్చాక రాత్రి దీపపు వెలుతురులో తన ముఖాన్ని అద్దంలో చూసుకుంది. ఆ రవ్వల దుద్దులు తెగ మెరిసిపోతూ ముఖానికి కొత్తకళ నిచ్చాయి. వాటిని చెవులకు ఉంచుకునే నిద్రపోయింది.

శాంత తల్లి మాణిక్యమ్మగారు ఉదయమే లేచి గుడికిపోతూ, "శాంతా తమ్ముడ్ని కాస్త ఆడించమ్మా నేను గుళ్లో పూజ చేయించుకొస్తాను" అని వెళ్లిపోయారు. తండ్రి ప్రసాదరావుగారు ఏదో పని ఉందని బయటికి వెళ్లారు.

ఆ రోజు శాంతా వాళ్ల బడికి సెలవు. అందుకని బద్ధకంగా తమ్ముడు మురళిని ఆడిస్తూ కూర్చుంది. ఏడాది నిండని మురళి అక్కను వదలడు.



రాత్రి అమ్మ "ఆ ఖరీదైన దుద్దులు వెంటనే సుమిత్రకిచ్చెయ్యాల్సింది ఇంటికి ఎందుకు తెచ్చావమ్మా? ఎరువు సొమ్ము బరువుచేటన్నారు పెద్దలు. తీసి జాగ్రత్తగా దాచి రేపు సుమిత్రకిచ్చెయ్యి. ఇంకెప్పుడూ అలా ఇంటికి తేకు" అంది. అప్పుడు తను "చెవులకుంటేనే పదిలంగా ఉంటాయమ్మా రేపు సుమిత్రే వచ్చి తీసుకెళ్తుంది" అని అంది. ఆ విషయం గుర్తొచ్చి చెవులు తడుముకుని చూసుకుంది. కుడి చెవికి దుద్దు లేదు! సీల మాత్రమే ఉంది!

చిన్న మురళిని మధ్యహాలులో వదిలేసి దుద్దు వెతుక్కుంటూ, కన్నీళ్లు తుడుచుకుంటూ ఇల్లంతా తిరిగింది. అది దొరకలేదు. మళ్లీ నిస్పృహతో హాల్లోకి వచ్చింది. అప్పటిదాకా హాయిగా ఆడుకుంటున్న తమ్ముడు దగ్గుతూ ఆయాసపడుతూ ఊపిరికోసం తంటాలు పడుతున్నాడు. పద్నాలుగేళ్ల శాంత నిలువునా ఒణికిపోయింది!

"రవ్వల దుద్దు పోయింది, దాని ఖరీదు వేల రూపాయలు చేస్తుంది. తన తండ్రి తీర్చగలిగిన సొమ్ము కాదది" అని అసలే ఒక పక్క కుళ్లుతుంటే, తన ముద్దుల తమ్ముడు ఇలాగైపోయాడు!

"భగవంతుడా, నా తమ్ముడ్ని బతికించు" అనుకుంటూ దుఃఖం పొర్లుకొస్తుంటే ఏం చేయడానికీ తోచక వాడిని ఒళ్లోకి తీసుకుంది. "కనకమ్మా!" అని పని మనిషిని పిలిచింది. అది వస్తూనే "అయ్యో! బాబుకేమైందమ్మా? ఏదో మింగినట్టున్నాడు" అంది.

వెంటనే శాంతవాడి గొంతులోకి వేలు పెట్టింది. వాడు వెంటనే భళ్లున కక్కేశాడు. ఆ కక్కులో ఎదురుగా రవ్వల దుద్దు పడి ఉంది!

ఒకసారి ప్రాణం కుదుట పడింది శాంతకు. తన ప్రాణంతో సమానమైన తమ్ముడు కాసిని మంచినీళ్లు తాగి భుజం మీద పడుకుని మళ్లీ కేరింతాలు మొదలెట్టాడు. వాడు కక్కేసిన దుద్దును కడిగి రెండోది కూడా తీసి రెండింటినీ అల్మారాలో పదిలంగా దాచింది. కనకమ్మ ఇల్లు కడిగేసింది.

అప్పుడే తల్లి వచ్చింది. వస్తూనే "అదేమిటే శాంతా నీ కళ్లు ఎర్రగా ఉన్నాయి?" అని అడగటం, కనకమ్మ జరిగిన విషయం చెప్పటం అయింది.

"ఎరువు సొమ్ము బరువు చేటమ్మా" అని మళ్లా అని "పోయి స్నానం చేసి నువ్వే వెళ్లి సుమిత్ర దుద్దులు తిరిగి ఇచ్చేసిరా" అన్నారు మాణిక్యమ్మగారు.

శాంత స్నానానికెళ్లింది. ఈ లోగా సుమిత్రే వచ్చింది వాళ్లింటికి. జరిగిన సంగతి విని చంటిపిల్లవాడిపైన జాలి కనబరిచింది. "రాత్రి శాంత తీసుకోమంటే, తొందరేముందని నేనే తీసుకోలేదండీ" అని తప్పు తనదే నన్నట్టు అన్నది సుమిత్ర.

అప్పుడే స్నానం ముగించి వచ్చిన శాంత "ఎరువు సొమ్ము బరువు చేటని తెలుసుకున్నానే సుమిత్రా" అంది.

"పొరపాటు నాదేనే, అసలు నీ చెవులవి తీసి నేను పెట్టుకుని, నావి నీకు నేనేగా పెట్టాను? అంతే కాకుండా రేపు తీసుకుంటానని నువ్విస్తున్నా తీసుకోకుండా వెళ్లిపోయాను" అంది సుమిత్ర.

"రాత్రి అద్దంలో చూసుకుని దుద్దులు బాగున్నాయని నేనెంత మురిసి పోయానో సుమిత్రకు తెలియదు కదా!" అని మనసులోనే అనుకుంది శాంత.

"అసలు నగలు పెట్టుకుని బడికి వెళ్లడం ఒకళ్లవి ఒకళ్లు మార్చుకోవడం మంచిది కాదమ్మా, మళ్లీ ఎప్పుడూ అలా చేయకండి" అని మెల్లగా మందలించారు మాణిక్యమ్మగారు.

# రహస్యం

ఆ వేళ అమ్మకు పుట్టిన రోజు. రాజూ, రవీ, పద్మా చాలా హడావిడిగా ఉన్నారు.

రాజు అమ్మ పుట్టిన రోజుకోసం, ఏమి బహుమానం ఇవ్వాలా అని ఆర్నెల్ల నుండీ ఆలోచిస్తున్నాడు. అమ్మ రోజూ భారత రామాయణాలు చదివి తమకు కథలు చెప్తూ ఉంటుంది.



ఎప్పుడో మేనమామ తనకిచ్చిన పది రూపాయల తోటి ఒక భగవద్గీత కాపీ కొన్నాడు రాజు. దానికి అందమైన అట్టవేసి ఒక రంగు కాగితంలో ఒక రిబ్బనుతో కట్టాడు. దాని మీద "ప్రియమైన అమ్మకు" అని రాశాడు.

అమ్మ పుట్టిన రోజుని అమ్మమ్మ బాగా జరుపుతుంది. అందుకని పిల్లలంతా దాన్ని ఒక పెద్ద పండుగ చేసినట్టు చేస్తారు.

నిన్న పక్కింటి లీల "అంత పెద్ద వాళ్లకు పుట్టిన రోజు పండుగ చేస్తారా?" అని నవ్వితే "తల్లీ తండ్రీ దైవ సమానులే, వాళ్ల పుట్టిన రోజులు తప్పకుండా చెయ్యాలి" అని పద్మ చెప్పింది.

పద్మ తన దగ్గర బోలెడు డబ్బు ఉందని మహాగర్వ పడుతోంది. ఆ మధ్య మామయ్య పట్టుపరికిణీ కుట్టించుకోమని పాతిక రూపాయలిచ్చాడు. తన పుట్టిన రోజునాడు అమ్మ ఎలాగా తనకు పట్టు పరికిణీ కుట్టించింది. అందుకని ఆ పాతిక రూపాయలు దాచుకుంది. అమ్మకు ప్రయాణం చేసేటప్పుడు ఉపయోగంగా ఉంటుందని ఒక పెద్ద తోలు సంచీ కొన్నది. దానిని అందంగా రంగు కాగితాలతోటి జరీ రిబ్బన్లతోటి కట్టి "ప్రియమైన నా తల్లికి" అని రాసిన చీటీ దానికంటించింది.

రాజూ, పద్మా తమతమ బహుమానాలను అమ్మకు స్నానం చేసిరాగానే ఇచ్చెయ్యాలని సిద్ధం చేసుకున్నారు.

రవి వాళ్ళను చూస్తూ, అటూ ఇటూ తిరుగుతూంటే "రవీ నువ్వు అమ్మకేమీ ఇవ్వవా?" అని అడిగింది.

"ఇస్తాను" అన్నాడు.

"ఏదీ?" అంది పద్మ.

"బయట ఉన్నది" అన్నాడు.

"అయ్యో, బయట ఎందుకుంచావు? చినుకులు పడుతున్నాయిరా" అని ఆదుర్దాగా అంది పద్మ.

ఒక చిరునవ్వు నవ్వాడు రవి. అంతేగాని బయటికి వెళ్లి దాన్ని తీసుకురాలేదు.

ఈ లోగా అమ్మ స్నానం చేసి, నాన్నగారు కొనుక్కొచ్చిన కొత్త చీర కట్టుకుంది. అమ్మమ్మ పూజచేసి హారతిచ్చింది.

నాన్నగారూ భోజనాల బల్ల దగ్గిర కూర్చుని పిల్లల్ని పిలిచారు. రాజు ముందు తన కానుకను అమ్మకిచ్చాడు. అమ్మ సంతోషించింది. తరువాత పద్మ తన కానుకనిచ్చింది. చాలా బాగుందంది అమ్మ.

అందరూ రవి వైపు తిరిగారు. నాన్నగారూ, "రవీ, నీ కానుక ఏదిరా?" అని అడిగారు.

"బయట ఉన్నది" అన్నాడు రవి.

"అయ్యో వాన వస్తోంది తడిసిపోతుంది త్వరగా తీసుకురా" అన్నది అమ్మ.

"నువ్వేరా అది నీ దగ్గిరకు రాదు" అన్నాడు రవి చిలిపిగా నవ్వుతూ.

అందరూ బయటికి వెళ్ళారు. రెండు గజాల మేర ఒక గుడ్డ కప్పి ఉన్న చోటకి రవి వాళ్లను తీసుకు వెళ్లాడు.

"అమ్మా, ఒక్కసారి కళ్లు మూసుకో" అన్నాడు తల్లి కళ్లు మూసుకుంది.

కళ్లు తెరిచిన తల్లి ఆశ్చర్యానికి అంతులేదు. అక్కడ ఆకుపచ్చరంగులో "భగవంతుడా, మా అమ్మకు ఆయురారోగ్యాలిచ్చి మాకు మరి నూరు పుట్టిన రోజులు చేసే భాగ్యాన్నియ్యి!" అని "ప్రేమతో రవి" అనీ ఉంది. అదంతా కొత్తిమిరి అక్షరాలతో ఉంది.

అంత అందంగా కొత్తిమిరితో అన్ని అక్షరాలను ఎలా పెంచాడా అని అందరూ ఆశ్చర్యపోయారు. అమ్మకు కొత్తిమిరి అంటే ప్రాణం.

"రవీ, ఒక్క అక్షరమైనా చెదరకుండా ఎంత చక్కగా పెంచావురా? మా కెవ్వరికీ తెలియకుండా అన్నాళ్లూ ఎలా ఉంచావురా?" అని ప్రేమతో తల్లి అడుగుతూంటే, రవి సిగ్గుపడి సంతోష పడిపోయాడు.

తరువాత తోట కత్తెరతో జాగ్రత్తగా కొత్తిమిరి కోసి, ఆ పూట పచ్చడి చెయ్యమని అమ్మమ్మకిచ్చాడు.

# తమసోమా జ్యోతిర్గమయ

అనగా అనగా ఒక రాజుగారుండేవారు. ఆయన పెద్ద రాజభవనంలో ఎప్పుడూ ఒంటరిగా ఉండేవారు. ఆ భవనం నలు మూలలా చాలా ఎత్తైన సరుగుడు చెట్లులుండేవి. ఆయన ఏనాడూ బయట ఏముందో చూసేవాడు కాదు. ఎప్పుడూ విచారంగా ఉండేవాడు. ఆ భవనంలో ఉన్న వాళ్లంతా అలాగే ఎప్పుడూ దిగులుగా ఉండేవారు. కాని ఆ భవనంలోని వంటగదివైపు ఒక చిన్న దడి ఉండేది. ఆ దడిలో నుండి వంట చేసే ఒక పిల్ల రాజభవనంలో నుండి బైటకు తరచూపోతూ అక్కడికి దగ్గర్లో ఉన్న ఒక పట్టణానికి పోయి వస్తూ ఉండేది. ఆ పిల్ల పేరు చిరునవ్వు.



ఒకనాడు ఇద్దరు అందమైన చిన్న పిల్లలు నృత్యం చేసుకుంటూ వంటశాలవైపున్న దడిలో నుండి రాజుగారి వంటశాలలోకి ప్రవేశించారు. చిరునవ్వు అక్కడే కూర్చుని కూరలు తరుగుతోంది. ఈ చిన్న పిల్లలు రంగు రంగుల దుస్తుల్లో ముత్యాల్లాంటి పలువరుసలతో గంతులేస్తూ పిల్లి మొగ్గలేస్తూ పకపకా నవ్వుకుంటూ తిరుగుతూ ఉంటే, చిరునవ్వు కూడా గట్టిగా నవ్వుకుంటూ "మీరెవరు, ఎందుకొచ్చారిక్కడికి?" అని అడిగింది. వాళ్ళు "మేము రాజుగార్ని చూడాలని వచ్చాం" అన్నారు.

"పెరటి గుమ్మంలో నుండి వంటశాలలోకి ప్రవేశిస్తే మీకు రాజుగారెలా కనిపిస్తారు? మీరు సింహద్వారంలో నుండి వెళ్లి రాజుగార్ని చూడాలి" అంది చిరునవ్వు.

ఈ నవ్వులన్నీ విని లోపల గాడి పొయ్యిదగ్గర వంట పని చూసుకుంటున్న పాకకళాశాస్త్రి పరుగుపరుగున వచ్చాడు. చేతిలో పెద్ద గరిటతో మోకాళ్ల దాకా ఎర్ర పట్టుపంచకట్టుకుని, నడుంకి జరీకండువా కట్టుకుని ఆ నవ్వే పిల్లల్నీ కూరలు తరిగే చిరునవ్వునూ చూసి తనూ నవ్వుతూ "ఎవరమ్మాయిలూ మీరు" అన్నాడు.

"నా పేరు వజ్రరశ్మి" అని ఒక అమ్మాయంటే, రెండో అమ్మాయి "నా పేరు వైడూర్యరశ్మి" అంది.

వజ్రం, వైడూర్యం గలగల నవ్వుకుంటూ మిలమిల మెరుస్తూ చకచక పరుగులు తీస్తూ, "మేము రాజుగార్ని చూడాలి" అని మళ్లీ అన్నారు.

"రాజుగార్ని చూడాలంటే సింహద్వారం వైపునుండి వెళ్లి చూడాలిగాని వంటశాలలో రాజుగారెలా కనిపిస్తారు" అని పాకకళాశాస్త్రి తనూ పకపక నవ్వుతూ చేతిలో గరిటను రకరకాలుగా తిప్పుకుంటూ అన్నాడు.

అప్పుడే అక్కడికి వచ్చాడు రాజుగారి వద్దన బ్రహ్మడు ఆహారపతి. ఎప్పుడూ ముఖం మాడ్చుకుని నవ్వితే పాపం అన్నట్టుండేవాడు. అతను కూడా నవ్వుతూ "ఏమైంది? వీళ్లెవరు" అని అడిగాడు. పాకకళాశాస్త్రి "వీళ్లు రాజుగార్ని చూస్తారుట, సింహద్వారం వైపు పొమ్మంటే పోరుట" అన్నాడు.

ఆహారపతి కూడా పొట్టపట్టుకుని నవ్వ ప్రారంభించాడు. ఇక అందరూ నవ్వుతూ తుళ్లుతూ వజ్రన్నీ, వైడూర్యాన్నీ చూస్తూ సంతోషిస్తున్నారు.

రాజుగారు ఆకలికి ఆగలేక ఆహారపతికోసం తన పరిచారిక భోజనప్రియను పంపారు. ఆమె వాతపు శరీరం వలన కాళ్లూ చేతులూ బిగుసుకుని గడకర్రలాగా నడుస్తుంది. అలాగే ఆయాసపడుతూ నడుస్తూ, అసలే చిటపటలాడే ముఖాన్ని మరీ చిటపటలాడించు కుంటూ వంటగదివైపు నడిచింది. భవనం కప్పెగిరిపోయేలాగా నవ్వులూ రంగురంగుల కాంతులూ నిపించిన వంటగదివైపు నడిచి అక్కడి దృశ్యాన్ని మాడ్చుకున్న ముఖంతో చూస్తూ చూస్తూ

ముఖంమ్మీదికి నవ్వు తెచ్చుకుని అసలే వంచలేని కాళ్లతో తనూ అటూ ఇటూ గంతులేసి పకపకానవ్వి, తరువాత పొట్ట పగిలేలా నవ్వు ప్రారంభించింది.

భోజనప్రియ రాకకోసం కూడా ఎదురు చూసీచూసీ, అసలే మటమటలాడే రాజుగారు ఆకలివల్ల మరీ కోపంతో చిటపట లాడుతూ అక్కడ చేరిన తన పరివారం అందరిపైన విసుగుకుని "అంతా ఏమయ్యారు? నా భోజనం ఏమైంది?" అని అరిచారు.

రాజుగారి అరుపు వంటశాలలోని అందరికీ వినిపించింది. భోజనప్రియ నవ్వుకుంటూ, గంతులెయ్యడం వలన వాతపు శరీరం వంగి కాళ్లు మామూలుగా వంగి రాజుగారి గదివైపుకు పరుగుతీసింది. ఆమె వెనకాలే ఆహారపతీ, ఆయన వెనకే పాకకళాశాస్త్రీ నవ్వుకుంటూ తుళ్లుకుంటూ వెళ్లేరు. ముందు ఎంతో తీక్షణంగానూ, కోపంగానూ, చిరాకుగానూ చూస్తున్న రాజుగారి ముఖం కూడా మారింది. ముందు ఆశ్చర్యం, తరువాత సంతోషం కనిపించినై, ఆ ముఖంలో క్రమంగా ఆయన కూడా నవ్వుతూ సంగతేమిటని అడిగారు. వాళ్ళంతా వజ్రరశ్మీ, వైడూర్యరశ్మీ రావడం గురించీ వారు వచ్చి వంటశాలను ఏ విధంగా వెలుగుతోనూ, నవ్వులతోనూ నింపారో ఉత్సాహంగా చెప్పారు. రాజుగారు వాళ్లని పిలుచుకు రమ్మని పంపారు.

వజ్రం, వైడూర్యం ఒకళ్లకొకళ్లు అతుక్కున్నట్టు పక్కపక్కనే కూర్చుని రాజుగారి వద్దకు రమ్మంటే లేచి వెళ్లలేదు. ఆ మాటవిని రాజుగారే అక్కడికి వేంచేశారు. వజ్రరశ్మీ, వైడూర్యరశ్మీ పిల్లిగంతులేస్తూ పరుగులు తీస్తూ పకపక నవ్వుతూ అక్కడ కనిపించారు – వాళ్లను ప్రేమగా చూస్తూ, రాజుగారు "మీరు నా భవనంలోకి రాకుండా వంటశాలలోనే ఉండిపోయా రెందుకూ? రండి, రండి నాతో భవనమంతా తిరగండి" అన్నారు.

రాజుగారితో "మీరెప్పుడూ కిటికీలు మూయించి మీ భవనాన్ని చీకటితో నింపుతారు" అని వజ్రం అంటే "ఆ చిన్న చిన్న కిటికీలు తెరిచినా ఒకటే తెరవకపోయినా ఒకటే" అంది వైడూర్యం.

"సరే మా భవనంలో ఉన్న కిటికీలన్నిటినీ తెరిపించి పెద్దవి చేయించేస్తా రండి" అన్నారు.

"కిటికీలు పెద్దవి చేస్తే మాత్రం వాటి కెదురుగా గుబురుగా పెరిగిన పిచ్చి చెట్లన్నీ భవనాన్ని చీకటిగానే ఉంచుతాయి" అని వజ్రం అంటే "చక్కని అందమైన పూలతోటలుంటే బాగా ఆడుకోవచ్చు, అవి కిటికీలకు అడ్డం రావుకూడా" అంది వైడూర్యం.

రాజుగారు క్షణం ఆలోచించి, తన భవనంలో ఒక్క చిరునవ్వు తప్ప అందరూ విచారంలో మునిగి తేలుతున్నట్టుంటారు. వంటశాలనంటి ఉన్న చిన్న దడి దగ్గర కూర్చుని కూరలు తరిగే చిరునవ్వు మాత్రమే రోజూ కాస్త వెలుగును చూస్తోంది. అందుకేనేమో ఆమె ఒక్కర్తీ ఎప్పుడూ విచారంగా కనిపించదు. వజ్రం, వైడూర్యం తన భవనంలో ఎల్లప్పుడూ తిరిగేటట్టు

చేస్తే రాజభవనంలో అందరూ సంతోషంతో తేలిపోవచ్చు అని అనుకున్నారు. వెంటనే వందల మంది వడ్రంగులనూ, మేస్త్రీలనూ, కూలీలనూ పిలిపించేశారు.

రాజుగారు తలవాలే గాని పనులు అవడం కష్టమా? మర్నాటికల్లా చిన్న కిటికీలు పెద్దవైనాయి, కిటికీల కడ్డంగా ఉన్న పిచ్చి చెట్లన్నిటినీ కొట్టేశారు. రంగురంగుల పువ్వుల చెట్లు పువ్వులతో సహా భవనం చుట్టూరా అమర్చేశారు. వజ్రం, వైడూర్యం తమతో తెచ్చిన కాంతి కిరణాలన్నీ భవనమంతటా విస్తరించాయి. ఇప్పుడు రాజుగారూ, ఆయన పరివారం చాలా సంతోషంగా ఎప్పుడూ నవ్వుతూ చురుకుగా పనులు చేసుకుంటూ ఉంటున్నారు.

రాజుగారు అన్ని ఏర్పాట్లూ చేసి, వజ్రరశ్మినీ, వైడూర్యరశ్మినీ భవనం అంతటా తిప్పాలని వంటశాలవైపు వెళ్లారు. అక్కడ వాళ్లు లేరు. చిరునవ్వు చెప్పింది వాళ్లిద్దరూ తమ సంతోషాన్నీ, కాంతి కిరణాలనూ భవనమంతటా విస్తరింపచేసి సూర్యకాంతిలో కలిసి పోయారని.

"అయితే, వజ్రరశ్మీ, వైడూర్యరశ్మీ సూర్యరశ్మిలోని భాగాలన్నమాట!" అని అన్నారు రాజుగారు.

రాజభవనంలోని వారంతా ఆరోగ్యంతో, సంతోషంతో చురుకుదనంతో తమ తమ పనులను చేసుకుంటూ, ఈ మార్పుకు కారణమైన వెలుగును ప్రసాదించిన వజ్రాన్నీ, వైడూర్యాన్నీ ఎల్లప్పుడూ తలుచుకుంటూ ఉండేవారు.

# పేదరాశి పెద్దమ్మ, బూరెలు

ఒకనాడు ఒక పేదరాశి పెద్దమ్మ ఒక గంపెడు బూరెలు వండింది. అప్పుడే ఒక చిన్న పిల్లవాడు ఆమె దగ్గిరికొచ్చి "నాకో బూరె పెట్టవా?" అన్నాడు. అప్పుడామె ఆ పిల్లవాడి చేతిలో ఒక బూరె పెట్టి, గంపెడు బూరెలూ లోపలికి పట్టుకెళ్లి దాచేసింది. అదేమంటే "బాబూ, కష్టపడకుండా ఏమీ కావాలనుకోకు" అంది.

ఆ పిల్లవాడి చేతిలో నుండి ఆ బూరె జారి కింద పడింది. దాన్ని తీసుకుందామని ఆ పిల్లవాడు ఒంగున్నాడు. ఈ లోగా ఆ బూరె దొర్లుకుంటూ దొర్లుకుంటూ చాలా దూరం పోయింది.

ఆ పిల్లవాడు బూరె అలా దొర్లుకు పోతోందేమా అని దాన్ని చూస్తూనే చాలా దూరం పరుగెత్తాడు. అది ఉన్నట్లుండి ఒక ఇంట్లోకి దూరింది.




ఆ ఇంట్లో ఉన్న నలుగురు పిల్లలూ దాన్ని అందుకోవాలని ఒకళ్లమీద ఒకళ్లు పోటీపడి 'బూరె నాక్కావాలంటే నాక్కావాలని ఇల్లు నాలుగు మూలలా పరుగులు తీసి ఆఖరుకి ఒకళ్లమీద ఒకళ్లు పడి నుదుర్లు బొప్పెలు కట్టాక ఆ బూరె ఎటు పోయిందో' తెలుసుకోలేక ఊరుకున్నారు.

కాని, ఆ పిల్లవాడు మాత్రం ఆ ఇంట్లో నుండి బూరె బయటికి రావడం మళ్లీ దొర్లుకుంటూ పోవడం చూసి దాని వెంట వెళ్లాడు. కొంత సేపటికా బూరె మరో ఇంట్లోకి దూరింది. ఆ ఇంట్లో ఒక ముసలి మనిషి నీరసంగా పడుకుని ఉన్నాడు. ఆకలిగా ఉంది, బూరెను చూసి దాన్ని తిందామని పట్టుకోపోయాడు. అతని చేతికి చిక్కకుండా అది మళ్లీ మరో చోటికి దారి తీసింది. బైట నిలబడ్డ పిల్లవాడు మాత్రం ఇంకా ఆశ చావక మళ్లీ దాని వెంట వెళ్లాడు.

కొంతసేపటికా బూరె ఒక పెరుగు దుకాణంలోకి దూరింది. ఆ దుకాణంలో కవ్వంతో ఒక మూలగా వెన్న చిలుకుతున్న గొల్లమ్మి "అరే బూరె వండుకోకుండానే వచ్చింది. ఎన్నాళ్లయ్యిందో బూరె తిని" అని సంతోషంగా దాన్ని పట్టుకోబోయి చల్లకుండను తన్నేసింది. చల్లకుండ పగిలిపోయింది. నేలంతా కడిగి బూరెకోసం చూస్తే అదీ లేదు. రెండు విధాలా నష్టపోయింది పాపం!

ఆ బూరె వెంటనే ప్రయాణం సాగించిన పిల్లవాడు మాత్రం అది ఎటుపోతోందో చూస్తూ కొండలూ గుట్టలూ దాటుకుంటూ పోయాడు పాపం. అయినా అది అతని చేతికి చిక్కకుండా మరో ఇంటికెళ్లింది. ఆ ఇంట్లో అత్తాకోడలూ దాన్ని చూసి నాక్కావాలంటే నాక్కావాలని మాటామాటా అనుకున్నారు. ఇరుగూ పొరుగో వచ్చి "అదే మమ్మా, ఒక్క బూరె కోసం ఎందుకు కొట్లాడుకుంటారు? చెరిసగం తినండి. మళ్లీ ఇద్దరూ కలిసి మరికాసిని బూరెలు వండుకు తినండి" అని తీర్పు చెప్పారు. ఈలోగా ఆ దారే పోతున్న పదిమంది ఆ బూరె దొర్లుతూ పోయే తీరును చూసి వాళ్ళూ ఆ పిల్లవాడి వెనకే పరుగెత్తారు.

అప్పుడే అడుక్కుతింటూ అటు వచ్చిన ఒక ముష్టిది "అరే బూరెరా, బూరె. రా కొడుకా మంచిగా తిందువు" అంటూ కొడుకును పిలిచేసరికి ఆ బూరె అక్కడ లేనేలేదు. ఆ వెళ్లే వాళ్లతోపాటు ఆ ముష్టి మనిషి కూడా కొడుకును వెంటేసుకుని పరుగుతీసింది. మరికొంత దూరం వెళ్లేసరికి మరో పాతికమంది, వీళ్ళందరూ ఎందుకు పరుగుతీస్తున్నారో తెలియకుండానే వాళ్ళతో పాటు వీళ్ళూ పరుగు పెట్టడం మొదలెట్టారు.

మరి కొంత దూరం వెళ్ళేసరికి మరో వందమంది వీళ్ళతో చేరారు. ఈ లోగా ఆ బూరె దారిలో పెద్ద గొయ్యిలో జారిపడిపోయింది. అది పడిపోవడం చూసిన పిల్లవాడు నిరాశతో మళ్ళీ వెళ్ళిపోయాడు. ముష్టిమనిషి నడవలేక అక్కడే ఆగిపోయింది. ఇక మిగతావాళ్ళంతా ముక్కుకు సూటిగా పరుగుతీస్తూనే ఉన్నారు.

నిరాశతో ఇంటి ముఖం పట్టిన పిల్లవాడు మళ్ళీ పేదరాశి పెద్దమ్మకెదురైనాడు. "ఏం బాబూ ఎటు పోతున్నావు" అంది పెద్దమ్మ.

"బూరె గోతిలో పడిపోయింది పెద్దమ్మా" అన్నాడు.

"అయ్యో మరోటి కావాలా" అంది.

"ఒద్దు. కష్టపడకుండా కావాలనుకున్నా. అందుకే అందకుండా పోయింది. పోనీలే, నాకు ఏం కావాలో తెలిసి వెతుక్కుంటూ అంతదూరం పరుగెత్తా కదా పెద్దమ్మా. ఆ పరుగెత్తే జనం వాళ్లకేం కావాలో కూడా తెలుసుకోకుండానే పరుగెత్తుతున్నారింకా."

"అవును బాబూ వాళ్ళందర్నీ మేలు గొలిపి ఆలోచించుకునేట్టు చెయ్యాలి. అప్పుడే మనిషి మనిషిలా బతుకుతాడు" అంది పెద్దమ్మ.



# అసలు ఎలుక

రమావాళ్ళ అమ్మ ఊరెళ్లింది. తాతకు జబ్బుచేసిందని టెలిగ్రాం వస్తే రవినీ రమనూ పక్కింటి దొడ్డమ్మగారికి అప్పగించి వెళ్ళింది. వాళ్ళ నాన్న ఆఫీసుపని ఎక్కువగా ఉందని రోజూ రాత్రి తొమ్మిదింటిదాకా ఇంటికి రావడం లేదు. ఎనిమిదేళ్ళ రవీ ఆరేళ్ల రమ భయపడతారని పక్కింటి దొడ్డమ్మగారు వాళ్ళ రజనిని తోడు పంపుతోంది రోజూ.

ఆ రోజు ఏడు గంటలైంది, చీకటిపడిపోయి చాలా సేపైంది. రవీ, రమ, రజని రాకను అంత దూరాన చూసి చాలా సంతోషించారు.



రజని రాత్రి పొద్దుపోయిందాకా ఊరికే కూర్చోవడం ఎందుకని ఏదో పని తెచ్చుకుని చేసుకుని పోతుంది. ఆవేళ రజని కుడిచేతి కింద తెల్ల కాగితాలూ, కవర్లూ పెట్టుకుంది. ఆ చేతికే ఒక చిన్న ప్లాస్టిక్ బుట్ట తగిలించుకుంది ఆ చేతి వేళ్లలో ఒక చాకలెట్ల పొట్లం, కాస్త రంగుదారం పట్టుకొంది. ఇక ఎడమ చేతికింద ఒక కథల పుస్తకం పెట్టుకుని, ఆ చేతిమీదే కుట్టుకునే గుడ్డ ఒకటి వేసుకుని ఆ చేతిలోనే ఒక పెన్నూ పెన్సిలూ ఒక సూదీ పట్టుకుంది.

ఎడం చేతిలోని సూదిలోకి కుడిచేతిలోని దారం వేళ్లతో ఎక్కించుకుంటూ చాకులెట్ల పొట్లం పెన్నూ, పెన్సిలూ పదిలంగా చేతుల్లోనే ఉంచుకుని గుమ్మంలో అడుగు పెట్టింది.

పిల్లలిద్దరూ సంతోషంగా "రా అక్కా ఆలస్యమైతే నువ్వు రావేమో ఇవాళ్ళ. అని భయపడ్డాం" అంటూ ఎదురెళ్ళారు.

పిల్లల పడకగదిలోకి అడుగు పెట్టిన పదహారేళ్ల రజని ఒక్కసారి కెవ్వుమని కేకేసి అక్కడే ఉన్న ఒక పెద్ద స్టూలెక్కి నిలబడింది. ఆ కేక విన్న పిల్లలిద్దరూ తమ మంచాలెక్కి నిలబడి భయంతో ఏమైందని అడిగారు.

రజని చేతుల కింద కవర్లూ, కాగితాలూ, కథల పుస్తకం చేతులకు తగిలించుకున్న బుట్టా, బుట్టలోని రకరకాల కుట్టుసామానూ, చేతుల్లోని పెన్నూ పెన్సిలూ, సూదీ దారమూ ఒకటేమిటి అన్నీ నేలపాలై నలు దిక్కులా చెల్లాచెదురుగా పడి ఉన్నై. చాకలెట్లు ఆ అమ్మాయి ఓణీ కుచ్చెళ్లలో కొన్నీ నేలమీద కొన్నీ పడ్డై. ఇంకా భయం తగ్గని రజని, స్టూలు మీదే నిలబడి కాలితో కాలుతుడుచుకునే పట్టావైపు చూపింది. అక్కడ ఒక ఎలుక ఉంది. ఇంకా కదలకుండా అక్కడే ఉంది.

"ఛీ, ఎలుకను చూసి దడుసుకున్నానేమిటి?" అని అనుకున్నా స్టూలు మీదనుండి దిగిబుద్ధికాలేదు.

మంచాలెక్కిన పిల్లలిద్దరూ పొట్ట పగిలేలా నవ్వుకుంటూ దిగెళ్లి ఆ ఎలుకను చేత్తో పట్టుకున్నారు. "ఇది అసలు ఎలుక కాదక్కా, మైనపుది. అయినా అసలు ఎలుక ఐతే మాత్రం దాన్ని చూసి భయపడతారా?" అని నవ్వారు.

"అరే, నిజంగా ఎలుక కాదూ? అచ్చంగా ఎలుకలాగే ఉంది సుమా" అంటూ స్టూలు దిగి "అయ్యో నా బుట్టలో కుట్టు సామానంతా ఎలా పడిపోయిందో" అని విచారించింది.

రవీ రమ గది నలుమూలలకూ పాక్కుంటూ వెళ్లి ఆ సామానంతా బుట్టలోకెత్తి కవర్లూ కాగితాలూ బొత్తి చేసి రజని కిచ్చారు. మిగతా సామాను రజని ఏరుకుంది తరవాత అందరూ కూర్చుని చాకలెట్లు తిన్నారు. రజని కథల పుస్తకంలోంచి చిన్న చిన్న కథలు చదివి వినిపించింది. తరువాత కబుర్లు చెపుతూ తను తెచ్చిన గుడ్డమీద ఒకటో రెండో పువ్వులు కుట్టింది. ఈ లోగా పిల్లలిద్దరూ నిద్రపోయారు. తాపీగా కూర్చుని రెండు ఉత్తరాలు రాసుకుని కవర్లలో పెట్టి అంటించింది. వాటి మీద ఎడ్రసులు రాసి తను తెచ్చుకున్న గుడ్డమీద పెన్సిలుతో రెండు డిజైన్లు గీసుకుంది. ఈలోగా రవీ వాళ్ళ నాన్నగారు వచ్చారు. తన సామానంతా సర్దుకుని కూనిరాగం తీసుకుంటూ ఇంటికి వెళ్లాలని లేచి నుంచుంది. మళ్లీ అక్కడే కాళ్లు తుడుచుకునే పట్టా దగ్గిరే ఎలుకను చూసి ఉలిక్కిపడింది. "ఛీ, మైనపు ఎలుకను చూసి నేను భయపడతానా?" అనుకుంటూ మళ్లీ కూనిరాగం తీసుకుంటూ బయటికెళ్లింది.

కాని మైనపు ఎలుకను రవి తన దిండు కింద పెట్టుకుని నిద్రపోయాడు! ఈసారి రజనికి కనిపించింది అసలు ఎలుకే!!

# పల్లెటూళ్లో పద్మ

పద్మ బడికి సెలవులిచ్చారు, కాని వాళ్ళ నాన్నగారికి సెలవులు లేవు. పద్మను ఒక్కదాన్నీ కార్లో ఎక్కించి డ్రైవరుతోటి తాతగారి ఊరికి పంపారు వాళ్ళ అమ్మా, నాన్న. పద్మ తాతగారిల్లు చేరేసరికి రాత్రి అయ్యింది. కాస్త పెరుగన్నం తిని నిద్రపోయింది.

పద్మ తాతగారు కోదండరామయ్యగారు, ఆయన భార్య సీతమ్మగారు. మొదటి నుంచీ పల్లెటూళ్లోనే అలవాటుగా ఉండిపోయారు. వారికి గొడ్లసావడిలో బోలెడన్ని పశువులున్నై. సీతమ్మగారు ఆవుల్నీ, గేదెల్నీ పేర్లు పెట్టి పిలుస్తారు.



పద్మ ఆ మర్నాడు నిద్రలేచేసరికి వాళ్ళ బామ్మ ఆవుపాలు పితుకుతోంది. "పద్మా తొందరగా పోయి పళ్లు తోముకురామ్మా, గుమ్మపాలు తాగుదువుగాని" అన్నారు. ఏడేళ్ల పద్మకు గుమ్మపాలంటే ఏమిటో తెలియలా. "నానమ్మా గుమ్మపాలంటే ఏం పాలు?" అని అడిగింది.

"అప్పటికప్పుడు పిండిన పాలు నురుగుతో ఉన్నవి" అన్నారు సీతమ్మగారు.

పద్మ త్వరగా పోయి పళ్లుతోముకొచ్చింది. వాళ్ల బామ్మ పటిక బెల్లం, ఏలకుపొడి, కుంకంపువ్వూ కలిపి ఒక గ్లాసునిండా గుమ్మపాలు ఇచ్చారు పద్మకు. అవి తాగేసింది పద్మ. తరువాత ఏమి చెయ్యాలా అని ఆలోచించింది. తాతగారింట్లో ఆడుకునేందుకు పిల్లలు లేరు. వాళ్ల పాలేరు గొడ్ల సావిడిలో పని చేసుకుంటున్నాడు. వాడి దగ్గిరికెళ్లి వాడు చేసే పనిని చూస్తూ నుంచుంది.

"పద్దమ్మగోరు, తమరు ఎప్పుడొచ్చినారండీ?" అని అడిగాడు పాలేరు వెంకన్న.

"రాత్రి" అని మెల్లగా ఒక దూడ దగ్గిరికెళ్లి "వెంకన్నా నేను దీనికి గడ్డీ తవుడూ పెడతాన్రా" అంది పద్మ.

"తవరికి బయమేత్తదండమ్మగోరు" అన్నాడు వెంకన్న.

"లేదు వెంకన్నా, నేను పెద్దదాన్నని, నన్ను అమ్మా, నాన్నా ఇక్కడికి ఒక్కదాన్నే పంపారు. నాకు భయం లేదు. కొంచెం తవుడు నా చేతులో పొయ్యి" అని అరచేతుల్లో తవుడు పోసుకుని దూడ మూతి దగ్గిర పెట్టింది పద్మ. ఆ దూడ పద్మ చేతిలోని తవుడు నాకడం మొదలెట్టింది. పద్మ కిలకిలమని నవ్వి, ఒక గంతేసి మళ్లీ దూడ ముందు చెయ్యి జాపింది.

"నే చెప్తే వినండమ్మగోరు, మీకు బయమేత్తది" అన్నాడు వెంకన్న.

"లేదురా, అది నా చెయ్యి నాకితే నాకు చక్కిలి గిల్లేసిందిరా. అందుకని చెయ్యి లాక్కున్నా. మళ్లీ చక్కిలిగిల్లి పెడుతోంది చూడరా వెంకన్నా" అంటూ కేకలేసి కేరింతలు కొట్టింది పద్మ.

కోదండ రామయ్యగారు దూరాన్నుండి చూసి పద్మ ధైర్యాన్ని మనస్సులో మెచ్చుకున్నారు. ఆయన కూడా పాకలోకి వెళ్లారు, పద్మను ఇంట్లోకి తీసుకెళ్లడానికి.

"తాతయ్యా, ఈ దూడ పిర్రగిల్లినా అక్కడే ఉండి కదలదు. దానితోకమటుకు అటూ ఇటూ ఆడిస్తుంది. దాని తోక ఊపినప్పుడు నా మూతికి.... తగిలింది తాతయ్యా" అంటూ పొట్ట పట్టుకుని విరగబడి నవ్వింది పద్మ.

"దీనికి అన్నీ విచిత్రాలుగానే ఉన్నై. ఆ బస్తీలో ఆవులూ గేదెలూ కూడా కనిపించవు కాబోలు" అని "పద్మా నీకు నీళ్లు పోసి జడవేస్తానమ్మారా" అని లోపలికి పిలుచుకెళ్లారు సీతమ్మగారు.

పద్మ నీళ్లుపోసుకుని ముత్యంలా తయారై వచ్చేసరికి తాతయ్యా ముందు సావిడిలో ఉయ్యాల బల్లమీద కూర్చుని ఉన్నారు.

"తాతయ్యా నీకు మంచి కథలొచ్చా?" అని అడిగింది పద్మ.

"ఓ! నీకు చెప్పనా?" అని అడిగారు.

"నాకు కథలంటే భలే ఇష్టం" అంది పద్మ.

"సరే అయితే విను."

అనగా అనగా ఒక చిన్నమ్మాయి ఉందిట. దాని పేరు తళతళ. ఒకనాడు వాళ్ళమ్మ "అమ్మాయీ నువ్వు మన వీధిచివరి పళ్ల దుకాణానికెళ్లి అరడజను అరటి పళ్లు కొను. ఆ తర్వాత కూరల దుకాణంలో ఒక అరకిలో వంకాయలూ ఒక అరకిలో ఆలుగడ్డలూ కొను. చిల్లర జాగ్రత్తగా లెక్కపెట్టి తీసుకురా. వస్తూ వస్తూ దారిలో అత్తయ్యగారింటికి పోయి మన పనివాడు అప్పన్న ఊరి నుంచి ఎప్పుడొస్తాడో అడుగు" అని డబ్బులిచ్చింది.

తళతళ తల్లినడిగి పళ్ళకూ కూరలకూ ఎంత డబ్బివ్వాలో తెలుసుకుంది. గుమ్మందాకా వెళ్లాక చినుకులు పడుతున్నట్టు తెలుసుకుని మళ్లీ అమ్మ దగ్గిరకొచ్చింది.

"అమ్మా గొడుగివ్వవే వాన వస్తోంది" అన్నది.

"సరే తీసుకెళ్ళు. కాని జాగ్రత్తగా పట్టుకురా. అది నీకు మద్రాసు మామ కొనిచ్చిన గొడుగు" అంది.

తళతళ తను చెయ్యాల్సిన పనులేవో ఒకసారి తనలో తను వల్లించుకుంది. ఒకటి, అరవైపైసల అరటిపళ్లు కొనాలి. రెండు, రెండు రూపాయల్లో అరవైపైసలు పోతే మిగిలేది ఒక రూపాయి నలభైపైసలు. వాటితోటి వంకాయలూ ఆలుగడ్డలూ కొనాలి. మూడు వస్తూ వస్తూ దారిలో అత్తనడిగి అప్పన్న ఎప్పుడొస్తాడో అడగాలి. నాలుగు, గొడుగు జాగ్రత్తగా పట్టుకురావాలి. "అమ్మా వెళ్తున్నా తలుపేసుకో" అంటూ తళతళ బయల్దేరింది. ఒక బుట్ట ఎడం భుజానికి వేసుకుంది. గొడుగు కుడి చేత్తో పట్టుకుంది.

మొదట పళ్లుకొంది. అరవైపైసలిచ్చింది తరువాత అరవైపైసలకు వంకాయలు కొంది. అర్ధరూపాయిచ్చి అర్ధకిలో ఆలుగడ్డలు కూడా కొంది. వాటిని బుట్టలో వేసుకుని "ఒకటి రెండు మూడు నాలుగు అని తన పనులు లెక్కపెట్టుకుంది. త్వర త్వరగా మళ్లీ గొడుగు తెరిచి ఇంటివైపు బయల్దేరింది. ఈలోగా వాన బాగా ఎక్కువైంది. మెరుపులు మొదలైనై అక్కడే ఎవరిదో ఇల్లుంటే వాళ్ల వరండాలోకివెళ్లి గొడుగు మడిచి నుంచుంది. కొంచెం సేపటికి వాన తగ్గాక అత్తా వాళ్లింటికెళ్లింది.

తన బుట్ట కిందపెట్టి "అత్తా అప్పన్న ఊరి నుండి ఎప్పుడొస్తాడో అమ్మ అడగమంది" అంది.

"అయ్యో ఇప్పటిదాకా వానకదా, నిన్నెందుకు పంపిందే! అప్పన్న ఊరి నుండి వచ్చాడు. మీ ఇంటికే వెళ్లాడు" అంది అత్త. ఒసే, తళతళా నువ్వు బయట కాలుపెడితే మొరుపులొస్తయ్యే, నువ్వు మెరిసినట్టే అవ్వీ మెరుస్తయ్యే" అంది అత్త హాస్యంగా.

"పో అత్తా నువ్వు మరీను. వాన మళ్లీ వస్తుందేమో నేను వెళ్లిపోతా. మా అమ్మ నాకోసం ఎదురు చూస్తుంది" అంది తళతళ.

"సరే ఇవ్వాళ్ల కాస్త మిఠాయి చేశానే. ఈ గిన్నె కూడా పట్టుకెళ్లు. అమ్మా నాన్నా కూడా రుచి చూస్తారు." అని అత్త ఒక బొక్కెన లాటి గిన్నె ఇచ్చింది.

తళతళ మళ్లీ ఒకసారి చూసుకుంది తను పట్టుకెళ్లాల్సిన నాలుగు వస్తువులూ ఉన్నాయోలేవో, చిల్లర సరిగ్గా ఉందో లేదో అని లెక్కేసుకుని వెళ్లిపోయింది.

ఇంట్లో అడుగుపెట్టి, అమ్మకు పళ్లూ, కూరగాయలూ, చిల్లరా ఇచ్చేసింది. అత్త ఇచ్చిన మిఠాయి గిన్నె కూడా ఇచ్చింది. అమ్మ అప్పుడడిగింది "గొడుగేదే తళతళా?" అని.

అప్పుడు గాని గుర్తురాలేదు తళతళకు, తను గొడుగు ఎక్కడో మరిచిపోయినట్టు. కాని నాలుగు వస్తువులు తెచ్చింది. ఏడుపు ముఖం పెట్టింది. వాళ్లమ్మ "వాన ఆగిపోయే వేళకి నువ్వెక్కడున్నావే?" అని అడిగింది. "వాన పూర్తిగా వెలిసేసరికి అత్తావాళ్లింట్లో ఉన్నాను" అని ఆలోచించి అంతకుముందు పళ్ల దుకాణం దాటాక వాన ఎక్కువైతే ఆ పక్క నున్న ఇంటి వరండాలో నిలబడ్డానమ్మా, అక్కడ మరిచిపోయి ఉండవచ్చు" అంది. వాళ్లమ్మ అప్పన్నను చూసిరమ్మని పంపితే ఆ గొడుగు అక్కడే దొరికిందని వాడు తీసుకొచ్చాడు. అప్పుడు తళతళ ముఖం తళతళా మెరిసింది సంతోషంతో.

"అమ్మా నేను ఇక ముందెప్పుడూ అజాగ్రత్తగా ఉండనమ్మా" అని అంది.

"తాతయ్యా, తళతళ అంతవానలోనూ భయపడకుండా ఎవరింట్లోనో ఆగింది మరి అన్ని వస్తువులూ తెచ్చింది, ఆ గొడుగు కూడా తెస్తే బాగుండేది" అంది.

"పొరపాటుగా మర్చిపోవడం అందరం చేస్తూనే ఉంటామమ్మా. కోపం తెచ్చుకోకుండా తన పొరపాటు తెలుసుకుని వాళ్ళమ్మకు తనే చెప్పింది ఇక ముందు అజాగ్రత్తగా ఉండనని. అదీ ఆ పిల్ల మంచితనం" అన్నారు పద్మ తాత కోదండరామయ్యగారు.

"మంచి కథ చెప్పావు తాతయ్యా" అని పద్మ మురిసిపోయింది.

